# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

## 'స్త్రీ విముక్తి - వర్గపోరాటం'పై
అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితి
నిర్వహించిన

## పాట్నా సెమినార్ పత్రాల
## ప్రత్యేక సంచిక




151

అక్టోబర్ - నవంబర్
1993

విప్లవ రచయితల సంఘం

# విషయసూచిక




చందాలు పంపవలసిన అడ్రెస్ :
వి. చెంచయ్య
6-5-13, పిన్నంరాజువారి వీధి
కావలి 524 201

రచనలు పంపవలసిన అడ్రెస్ :
కె. వి. ఆర్.
11-33-957, వెంగళరావు నగర్
కావలి 524 202

# సంపాదకీయం

## స్త్రీ విముక్తి ఉద్యమ దిశను నిర్ణయించుకునే మార్గంలో...

మన సామాజిక జీవితం రానూ, రానూ ఎంతో సంక్లిష్టమవుతోంది. దీని వలన సాంప్రదాయంగా కొనసాగుతూ వస్తున్న ఉద్యమాలలో కూడా నూతన ఆలోచన, దృక్పథం చోటుచేసుకుంటున్న స్థితి కలుగుతోంది. యథాతథ సామాజిక నిర్మాణం ఆమోదించిన పద్ధతిలో ఉద్యమాలు కొనసాగించటమే సరైందని భావిస్తున్న దశలో 70వ దశకంలో, దాన్ని బద్దలు చేస్తూ నక్సల్బరీ ఉద్యమం ఆరంభమయింది. నక్సల్బరీ పోరాటం దేశంలోనూ, ముఖ్యంగా ఆంధ్రాలో బలీయమైన రాజకీయ సామాజిక ఆలోచనా క్రమాన్ని పెంచింది. ఈ దశలో అన్ని జీవిత పార్శ్వాలపై దృష్టిని సారించటం జరిగింది. అయితే అవి నిర్దుష్ట నిర్మాణ రూపాలు తీసుకోలేదు.

తెలంగాణా సాయుధ పోరాటానంతర కాలంలో స్త్రీలను ప్రధాన జీవన స్రవంతిలో భాగమని గుర్తించిన ఉద్యమమిదేనని చెప్పాలి. ఎంతోమంది స్త్రీలు ఈ ఉద్యమాల్లో పాల్గొన్నారు. అమరులయ్యారు. అయినప్పటికీ దళితుల పట్ల, స్త్రీల పట్ల అవసరమయిన, కావాల్సిన చైతన్యం ఈ ఉద్యమ కాలంలో కలిగి వుందని చెప్పలేం. అయితే సామాజికంగా, పెరుగుతున్న చైతన్యం, కొత్త ప్రశ్నలను, కొత్త జవాబులను వెతుక్కుంటోంది. దీనిలో భాగంగానే దేశవ్యాప్తంగా బలీయమైన స్త్రీల ఉద్యమాలు, స్త్రీల సమస్యల పట్ల దృక్పథంపై అనేక చర్చలు సాగుతున్నాయి. సమాజంలోనూ రోజు రోజూ ఉద్యమాల స్పందన, పోరాట పటిమ వెల్లివిరిస్తున్న తరుణమిది. సామాజిక ఉద్యమాలలో, సాంఘిక సంస్కరణోద్యమాలలో, ఆఖరుకి మతతత్వ ఊరేగింపుల్లో సహితం స్త్రీలను పెద్ద సంఖ్యలో కదిలిస్తున్నారు.

స్త్రీలు, ప్రజా జీవన స్రవంతిలో కొస్తున్న తరుణంలో స్త్రీల పట్ల, వారి సమస్యల పట్ల అవగాహనను పెంచుకోవడం ఎంతైనా అవసరం. అవసరం కంటే తరుముకొస్తున్న వాస్తవం.

ఒకవైపు కుటుంబ హింస, ఇంటి చాకిరి, మాతృత్వం, జెండర్ వంటి సమస్యలపై ఎంతో సునిశితంగా, స్త్రీల హృదయాలకు గాఢంగా హత్తుకునేలాగా ఫెమినిస్టుల ఉద్యమం, మరోవైపు రాజ్య వ్యతిరేక దృక్పథంతో సామాజిక ఉద్యమాలలో పాల్గొంటూ, వర్గ పునాదిగా కలిగిన సమాజంలో మార్పు వచ్చినప్పుడే, స్త్రీల జీవితాలకు విముక్తి కలుగుతుందని భావిస్తూ కుటుంబాలను వదిలి ప్రాణాలకు తెగించి పోరాడుతున్న స్త్రీల పోరాటాలు. వీటి రెండింటిని సమన్వయం చేసుకోవాల్సిన అవసరం మన ముందున్న కర్తవ్యం.

ఆడపిల్లలు పుట్టడం శారీరక ధర్మమైతే, నేను 'స్త్రీ'నన్న భావన మనసుకి పట్టించింది ఈ సమాజం. ఉగ్గుపాల నుండి వల్లకాడుకు వెళ్ళేదాకా స్త్రీలను రకరకాల ఆంక్షల మధ్య, మనసును, శరీరాన్ని అధీనం చేసుకుంది సమాజం. శారీరకంగా పెరుగుదల అవసరమైన చిన్నతనాన్నే, ఆడపిల్లలు తినకపోయినా ఫరవాలేదన్న జ్ఞానాన్ని, స్వయంగా వారికే కలిగించటంతో బాల్యం ప్రారంభమవుతుంది. అది క్రమంగా పెరిగి పెరిగి స్త్రీలు తమ అశక్తతను వారే గుర్తించే స్థితికి ఈ సమాజం నెట్టింది.

స్త్రీలను బయట ప్రపంచంలోకి వెళ్ళనివ్వకుండా 'శీల రక్షణ' పేరుతో నాలుగు గోడల మధ్య బంధించి, సమాజంలో కలిసి తిరిగితే వచ్చే జ్ఞానాన్నుండి వారిని దూరం చేసి, స్త్రీలకు సామాజిక సంబంధాల పట్ల సంకుచిత ధోరణులున్నాయని, అది వారి నైజమని ఈ సమాజమే ముద్ర వేస్తోంది. మానసికంగా వారిని అజ్ఞానులను చేస్తుంది. ఈ విధంగా స్త్రీల ప్రతిఘటన అనేక అంశాలపై చర్చను లేపింది.

పురాతన కాలం నుండి వారసత్వం తండ్రి నుండి వస్తోంది. మన రాజ్యాంగంతో సహా ధృవీకరించిన విషయం. అలాకాక పునరుత్పత్తి స్త్రీల హక్కుగా వుండాలని, స్త్రీలకు తమ శరీరం మీద, మనసు మీద స్వేచ్ఛ వుండాలని స్త్రీ వాదం కోరుతోంది.

స్త్రీల జీవన విధానం మీద, సమాజంలో స్త్రీల భాగస్వామ్యం మీద చర్చను పెట్టటమేగాక ఇప్పుడున్న సంస్థల నిర్మాణాల మీద పితృస్వామ్య అధికార భావజాలం ఎలా పని చేస్తుందో వివరించటం ద్వారా, నిర్మాణాల పట్ల చర్చను భిన్నమైన పద్ధతిలో రేకెత్తిస్తున్నారు.

ఇలా స్త్రీ వాద దృక్పథంలో వారి వారి ధోరణులను బట్టి ఈ చర్చలు సాగుతున్నాయి. బూర్జువా ఫెమినిజం, రాడికల్ ఫెమినిజం, సోషలిస్టు ఫెమినిజం వంటివి ప్రధాన ధోరణులు. వీరి ధోరణులేమైనా, ఆచరణలో రాజ్యం పట్ల వీరి స్వభావం, సమస్యల పట్ల అవగాహన మనం గమనించాల్సిన అవసరముంది.

స్త్రీ వాదం ప్రతిపాదిస్తున్న విషయాలు సరైన దృక్కోణం నుండి పరిశీలించి ముందుకు కదలాల్సిన అవసరం విప్లవోద్యమాలకుంది. సామాజిక విప్లవంలో భాగంగా స్త్రీ విముక్తి ఉద్యమం నడవాలని, ఈ క్రమంలోనే స్త్రీల ప్రత్యేక విషయాలపై పోరాటం జరపాలని, తద్వారానే సమాజ విముక్తి సాధ్యమవుతుందని విప్లవోద్యమం భావిస్తోంది.

స్త్రీలపై జరిగే హింసే ఈ సమాజం యొక్క పునాదని, కాబట్టి స్త్రీలపై జరిగే హింసను ఎదుర్కోవడమే ప్రధాన విషయమని భావిస్తున్న స్త్రీ వాద దృక్పథం సరైంది కాదని, అయితే సమాజంలో మొదటి అణిచివేత స్త్రీల మీదేనని చరిత్ర క్రమాన్ని గుర్తిస్తూనే, అది స్వంత ఆస్తి పెంచే క్రమంలో వచ్చిన మొదటి మార్పని, ఈ స్వంత ఆస్తి దృక్పథం పెరిగేకొద్దీ, ఈ అణిచివేత కూడా స్థిరత్వం పొందిందని, ఆ తరువాత కాలంలో అది క్రమంగా ప్రాకి దళితులపై తన ఉక్కు పాదాలను మోపి, సమాజం నుండి వెలివేసిందని, కనుక స్త్రీలు, దళితులు ఈ సాంఘిక మహా విప్లవ క్రమంలో వారి పోరాటమూ కలగలిపి, రెండురకాల పోరాటాలను చెయ్యాలని భావిస్తోంది.

దేశవ్యాప్తంగా సంఘటిత మవుతున్న స్త్రీల ప్రతిఘటనోద్యమం, ముఖ్యంగా ఆంధ్రదేశంలో స్త్రీల దృక్పథంపై సాగుతున్న చర్చల ఫలితంగా, అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితి స్త్రీ వాదంపై కనీసమైన నిర్దిష్టతను రూపొందించుకోవడంలో భాగంగా పాట్నాలో సెమినార్ నిర్వహించింది. ఈ సెమినార్‌లో అనేక రకాలైన వాదోపవాదాలు ప్రతిబింబించాయి. ఈ చర్చలు ముందు ముందు ఇంకా సాగి స్త్రీ విముక్తి ఉద్యమం యొక్క దిశను నిర్ణయించుకునే వైపు సాగుతుందని ఆశిద్దాం.

— నల్లూరి రుక్మిణి



# స్త్రీ విముక్తి - వర్గ పోరాటం : ఒక మార్క్సిస్టు దృక్పథం

అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి కోసం విరసం రూపొందించిన అవగాహనా పత్రం.

భారతదేశంలో తలెత్తుతున్న సాంఘిక ఉద్యమాలలోని ప్రధానమైన కోణాలలో స్త్రీ సమస్య ఒకటి. సమకాలీన సాంఘిక సమస్యలను శాస్త్రీయ పద్ధతిలో వ్యాఖ్యానించడంలో విశిష్ట సామర్థ్యం ఉన్న మార్క్సిజం ఈ అంశాన్ని అర్థం చేసుకోవడానికి కూడ తగిన భావనా, విశ్లేషణా పరికరాలను అందజేస్తుంది. మార్క్సిజం పిడివాదం కాదు గనుకనే ఇది సాధ్యమవుతుంది.

భారత జాతీయోద్యమం రోజుల నుంచీ కూడ చాల కాలం పాటు స్త్రీ సమస్య పట్ల అసమగ్రమైన, పాక్షికమైన అవగాహన ఉంటూ వచ్చింది రాజకీయ పార్టీలలో ఏ ఒక్కటైనా మహిళా విభాగాలను ఏర్పరచవలసిన అవసరం లేదని భావించడమే ఇందుకు నిదర్శనం. విభిన్న చారిత్రక కారణాల వల్ల, చివరికి విప్లవ కమ్యూనిస్టు పార్టీలు కూడ స్త్రీ సమస్యకు అవసరమైనంత ప్రాధాన్యత ఇవ్వడంలో విఫలమయ్యాయి.

స్వాతంత్ర్యానంతర కాలంలో, దాదాపు ఇరవై ఏళ్ళకు పైగా కమ్యూనిస్టు ఉద్యమం పార్లమెంటరీ రాజకీయాలలో తలమునకలైపోయింది. క్రమక్రమంగా శ్రామిక వర్గాల నుంచి దూరమైపోయింది. తత్ఫలితంగా, పార్లమెంటరీ వామపక్షాలు కేవలం రివిజనిస్టు ప్రజా సంఘాలుగా మారిపోయాయి. 1960ల చివరిలో నక్సల్బరీ ప్రజ్వలనకు రివిజనిజం పట్ల వ్యతిరేకత ప్రధాన కారణం. నక్సల్బరీలో సాయుధ పోరాటం పెల్లుబికిన రెండు సంవత్సరాల తర్వాత గాని ఒక మార్క్సిస్టు లెనినిస్టు పార్టీ స్థాపించబడలేదు. ప్రధానాంశమైన సాయుధ పోరాటాన్ని ప్రజాసంఘాలు నీరు కారుస్తాయని కొత్తగా ఏర్పడిన మార్క్సిస్టు లెనినిస్టు పార్టీ దృఢంగా భావించింది.

అందువల్ల ప్రజాసంఘాల ఏర్పాటు విషయంలో అవసరమైనంత ప్రాధాన్యతను ఇవ్వలేదు తత్ఫలితంగా ఇతర ప్రజా సంఘాలతో పాటు గానే మహిళా సంఘం అవసరం కూడ గుర్తించబడలేదు. ఈ చారిత్రక నేపథ్యంలో ఈ పరిమితిని అవసర మైనదిగానే గుర్తించడం జరిగింది.

ఐతే, ఈ లోపాన్ని అధిగమించవలసిన అవసరాన్ని సి పి ఐ (ఎం ఎల్( త్వరలోనే గుర్తించింది. తీవ్రమైన అసమానతలతో, భూస్వామిక సంస్కృతీ సాంప్రదాయంలో మునిగివున్న సామాజిక వ్యవస్థలో అర్థవంతమైన పరివర్తనను సాధించదలచుకుంటే ప్రజాసంఘాల ఏర్పాటు అనివార్యమని గుర్తించడం జరిగింది. రకరకాల ప్రజా సంఘాలు ఏర్పరచబడినప్పటికీ, యువజనులు, విద్యార్థులు, రైతు కూలీలు, మేధావులు మొదలైన బృందాలు సంఘటితం చేయబడినప్పటికీ, ప్రత్యేక మహిళా సంఘం అవసరాన్ని గుర్తించడం మాత్రం జరగలేదు. మార్క్సిస్టు లెనినిస్టు ఉద్యమం పెద్ద సంఖ్యలో మహిళలను ఆకర్షించిందనే వాస్తవం ఉన్నప్పటికీ ఈ అంశాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. 1980ల నుంచి రకరకాల బృందాల స్త్రీల నుంచి ఒత్తిడి, పరిస్థితుల ప్రాబల్యం కలగలిసి స్త్రీల విభాగాలు ఏర్పరచడం మొదలయింది. ఐతే ఈ సంఘాలు స్త్రీల దుస్థితి గురించి దీర్ఘకాలిక దృక్పథం సమకూర్చుకోలేక పోయాయి. సరైన సైద్ధాంతిక అవగాహన కొరవడిన ఫలితంగా మార్క్సిస్టు లెనినిస్టు ఉద్యమానికి స్త్రీ సమస్య పట్ల అసంపూర్ణ అవగాహన కలిగింది. ఈ లోపాన్ని పూరించేందుకు ఈ పత్రం ఒక ప్రయత్నం చేస్తోంది.

మన అర్ధ భూస్వామ్య, అర్ధ వలస సాంఘికార్థిక వ్యవస్థకు కొన్ని ప్రత్యేకత లున్నాయి. మన సమాజంలో ఉన్న వర్గ విభేదం, కరడు గట్టిన కుల వ్యవస్థల దృష్ట్యా, స్త్రీ సమస్య ఈ రెండు అంశాలతోనూ కలగలిసిపోయింది. అందువల్ల, అది చాల సంక్లిష్ట సమస్యగా ఉంది. ఈ అగ్రవర్గ, అగ్రకుల, పురుషాధిపత్య నిర్మాణాలను కూలదోయడం ద్వారా మాత్రమే స్త్రీ విముక్తి సాధ్యమవుతుంది. భూస్వామిక పునాది బలంగా ఉన్న ఈ సమాజంలో అత్యధిక సంఖ్యాక స్త్రీలు దుర్భర దారిద్ర్య, నిరాధార స్థితిలో జీవిస్తున్నారు. వాళ్ళకు ఉత్పత్తి సాధనాల మీద, తమ శ్రమ ఉత్పత్తుల మీద అధికారం నిరాకరించబడుతోంది. వాళ్ళు చాల రకాల ఆర్థికేతర నిర్బంధాలకు ఎదుర్కొవలసి వస్తుంది. స్త్రీల మీద హింసకు స్పష్టమైన

ఆర్థిక లక్ష్యం ఉంది. స్త్రీల మీద హింస వాళ్ళను అదుపులో ఉంచుతుంది ఆర్థిక అవకాశాలను పొందడానికి ఇల్లు వదిలి బైటికి కదలకుండా అరికడుతుంది. అదే సమయంలో వాళ్ళను చాల తక్కువ వేతనపు శ్రమ రూపాలలోకి, ఉచిత శ్రమ రూపాలలోకి నెడుతుంది. అంతేగాక, సామ్రాజ్యవాద శక్తుల దృష్టిలో స్త్రీలంటే చౌక శ్రమ వనరులు, లైంగికంగా ఉపయోగపడే వస్తువులు. స్త్రీలు జీవించవలసి వస్తున్న వెనుకబడిన జీవన పరిస్థితుల వల్ల వాళ్ళు చాలా కాలం చెల్లిన పద్ధతుల్లో ఇంటి పని చేయవలసి వస్తుంది. తద్వారా వాళ్ళ శ్రమ చౌక శ్రమగా ఉంటుంది. అట్లాగే స్త్రీలు అవసరమైనప్పుడు పనికొచ్చే నిలువ శ్రామిక శక్తిగా ఉంటారు.

అసంఘటిత కార్మికులుగా, వ్యవసాయ శ్రామికులుగా, పారిశ్రామిక కార్మికులుగా, మధ్యతరగతి కుటుంబ సభ్యులుగాను స్త్రీలు ఇంటి చాకిరీకి, పిల్లల పెంపకానికి కట్టివేయబడి తీవ్రమైన సాంఘిక, ఆర్థిక అణచివేతకూ అన్యాయానికి గురి అయ్యే స్థితిలో ఉన్నారు. మన అర్ధ భూస్వామ్య, అర్ధ వలస నేపథ్యంలో ఈ వర్గ-కుల దోపిడీ కోణంతో పాటుగా, స్త్రీలు పురుషాధిపత్య అణచివేతకు కూడ గురి అవుతున్నారు. కనుక, దోపిడీ పాలక వర్గాలను కూలదోయవలసిన అవసరంతో పాటుగానే మనం పితృస్వామ్యం, స్త్రీ పురుష వివక్ష, కుటుంబం, స్త్రీల లైంగికత అంశాలపై కూడ కేంద్రీకరించవలసి ఉంది.

పితృస్వామ్యం అంటే స్త్రీల శ్రమను, లైంగికతను, పునరుత్పత్తి శక్తిని దోపిడీ చేయడం. అది ప్రతి సంస్కృతిలోనూ, సమాజంలోనూ వేరువేరుగా వ్యక్తమవుతుంది. సమకాలీన భారత సమాజంలో, హిందూ మనుధర్మ భావాలు అధిపత్యంలో ఉన్నందువల్ల, పితృస్వామ్యం భూస్వామ్య వ్యవస్థను కొనసాగించే సాధనంగా మారిపోతుంది. అది స్త్రీలను పూర్తిగా నిమ్న స్థాయికి నెట్టివేస్తుంది. ఇక్కడ పితృస్వామ్యం చాల నిర్బంధ పూరితం అవుతుంది. 'దేవత, మాతృమూర్తి' లాంటి చిహ్నాలను బలోపేతం చేస్తుంది. ఈ చిహ్నాలకు నిజమైన అర్థం స్త్రీలను సాంప్రదాయికంగా నిర్దేశించబడిన బాధ్యతలలోకి కుదించి వేయడమే. అందువల్లనే సతీసహగమనం వంటి ఆచారాలు ఇంకా మన సమాజంలో కొనసాగుతున్నాయి. చివరికి శాస్త్రీయ ప్రగతిని కూడ పితృస్వామిక భావజాలానికి ఊడిగం చేసేలా మారుస్తారనడానికి బలమైన ఉదాహరణలు అమ్నియో సెంటెసిస్, గర్భస్థ శిశులింగ నిర్ధారణ పరీక్షల దుర్వినియోగాలు.

మన సమాజంలో పితృస్వామ్యం ప్రధానంగా ఉత్పత్తి పద్ధతి, భాష, సంస్కృతి రంగాలలో పని చేస్తుంది. సంస్కృతి, భాషా రంగాలలో పితృస్వామ్య పాత్రను గుర్తించడం, ప్రశ్నించడం జరిగింది గాని, పితృస్వామిక ఉత్పత్తి పద్ధతిని తగినంతగా అర్థం చేసుకోవడం ఇంకా జరగవలనే ఉంది. కేవలం దాని వేరు వేరు రూపాలను గుర్తించినంత మాత్రాన సరిపోదు. పితృస్వామ్యంపై పోరాడడం ఎట్లా?

ఈ అంశంపై మార్క్సిస్టు సిద్ధాంతం స్పష్టమైన మార్గదర్శక సూత్రాలు ఇవ్వనప్పటికీ, విప్లవానంతర సమాజాల అనుభవం మనకు చాల ఉపయోగకరంగా ఉంటుంది. మార్క్సిస్టులు పితృస్వామ్యంపై పోరాటానికి ఇవ్వవలసినంత ప్రాధాన్యతను ఇవ్వరని చూపడానికి ఈ సమాజాలను తరచుగా ఉదాహరణలుగా చూపడం జరుగుతోంది. ఆ సమాజాలలో పితృస్వామిక ఆధిపత్య పద్ధతులకు వ్యతిరేకంగా పోరాటం విజయం సాధించలేదనే మాట నిజమే అయినప్పటికీ, అక్కడ ఒక నాంది జరిగిందనే విషయం నిరాకరించడానికి వీలు లేదు. అయితే ఆ యా దేశాలలో రివిజనిజం రంగం మీదికి రావడం ఈ ప్రయత్నాలకు ముగింపు పలికింది. ఆ సమాజాలలో పితృస్వామ్యాన్ని ఉత్పత్తి పద్ధతుల రంగంలో ఎదుర్కోవడం జరిగింది. సాంప్రదాయిక సాంఘిక కట్టుబాట్లనూ, అన్యాయాలనూ తొలగించేందుకు పోరాడి, స్త్రీలను పెద్ద సంఖ్యలో శ్రామిక శక్తిలోకి సమీకరించడం జరిగింది. తద్వారా ఆ యా సమాజాల అభివృద్ధిలో స్త్రీలు పాలుపంచుకొనేందుకు అవకాశం దొరికింది. పనులలో పురుషుల పనులు, స్త్రీల పనులు అనే తేడాలను స్త్రీలు సవాల్ చేయడం ప్రారంభించారు. మానసిక, శారీరక శ్రమల మధ్య అంతరాన్ని పూరించడానికి ఒక నిజమైన కృషి జరిగింది. రాజ్య విధానంగా స్త్రీలను ఇంటి బైట పనికి ప్రోత్సహించడం, స్త్రీ పురుషుల మధ్య చట్టపరమైన సమానతను ప్రవేశపెట్టడం, కుటుంబానికి, వివాహానికి సంబంధించిన చట్టాలను సరళం చేయడం, విద్యావకాశాలలో సమానత్వాన్ని ప్రోత్సహించటం, వ్యభిచారం వంటి లైంగిక దోపిడీ చిహ్నాలను, అలవాట్లను నిషేధించడం వంటి పనులు జరిగాయి ఈ చర్యలకు ఎంతో చారిత్రక ప్రాధాన్యత ఉన్నప్పటికీ, ఇందులో ఎన్నో అనుకూల అంశాలు ఉన్నప్పటికీ, అసమానతలు కొనసాగలేదని చెప్పడం పొరపాటే అవుతుంది. ఆ యా రాజ్యా

లలో అమలయిన విధానాలలో అంతర్గతంగా ఉన్న అభిప్రాయం ఏమంటే, స్త్రీల దోపిడీ దాదాపు పూర్తిగా వాళ్ళను వేతనోద్యోగాల నుంచి దూరం చేయడం మీదనే ఆధారపడిందనేది. ఈ అభిప్రాయం రెండు విషయాలను విస్మరిస్తుంది : ఒకటి, వివక్షతో కూడిన అంతరాల వ్యవస్థ కొనసాగే శ్రామిక శక్తిలో మహిళల స్థితి చిన్న చూపు చూడబడుతోందని అది విస్మరిస్తుంది. రెండు, స్త్రీల మీద కొత్త పనులు కూడ పని వాళ్ళు ఇంకా కఠినమైన ఒత్తిడికి గురవుతున్నారని అది విస్మరిస్తుంది. అందువల్ల స్త్రీలు గణనీయమైన విజయాలు సాధించినప్పటికీ, ఇంకా ప్రజా జీవనం లోనూ, వ్యక్తిగత జీవనం లోనూ రెండో స్థాయి సాంఘిక బృందంగానే ఉండి పోతున్నారు. అంటే, ఒకవేళ ఉత్పత్తి రంగంలో పితృస్వామ్యంతో పోరాడ దలచుకున్నట్లయితే, అసలు శ్రమ పితృస్వామ్యేతర పద్ధతుల్లో ఉండేటట్టుగా అభి వృద్ధి చేయాలి. శ్రమ స్థలంలో స్త్రీ పురుష వివక్షను ఎట్లా ఎదుర్కోవాలనే విష యంలో నిరంతర చైతన్యీకరణ జరగాలి. మరో మాటల్లో చెప్పాలంటే, అన్ని రకాల పనులను సమానంగా పంచుకోవడమనేది పితృస్వామిక ప్రాతిపదికను సవాల్ చేస్తుంది. తక్షణ పరిస్థితుల్లో దీన్ని అమలు చేయడం కేవలం విముక్తి ప్రాంతాల్లో మాత్రమే సాధ్యం కావచ్చు. కాని పితృస్వామిక ఆధిపత్యాన్ని నిరంతర ప్రాతి పదిక మీద సవాలు చేయడం, దానికి వ్యతిరేకంగా పోరాటం చేపట్టడం తప్పనిసరి అవసరం.

స్త్రీల దుస్థితిని అర్థం చేసుకోవడంలో స్త్రీ పురుష భేదాన్ని పరిగణనలోకి తీసుకోకపోతే అది పాక్షికమే అవుతుంది ఈ స్త్రీ పురుష భేదం పితృస్వామ్యానికీ, కుటుంబ వ్యవస్థకూ సేవ చేయడంలో స్పష్టంగా బైటికి కనబడేటట్టు గానూ, అంత ర్గతం గానూ కూడ పని చేస్తుంది. 'స్త్రీలు పుట్టరు, తయారు చేయబడతారు' అని సైమన్ డిబవర్ చెప్పిన ఆలోచనాత్మక వాక్యం మన సమాజంలో స్త్రీ పురుష భేదం పాత్రను సరిగా గుర్తించింది. జీవశాస్త్రపరమైన మానవ జీవులు స్త్రీ పురుష భేదం పునాదిపై పెంపకం, శిక్షణ, విద్య వంటి ఎన్నో రంగాలలో విడదీయబడుతున్నారు. ఇక్కడ స్త్రీ పురుష భేదం, వివక్ష దైనందిన ప్రాతిపదిక మీద అమలు చేయబడు తున్నాయి, ఈ వివక్ష ఎంతగా వ్యాపించి ఉందంటే మన జీవితాలలోని ప్రతి అంశం పైన- మన ప్రవర్తన, అలవాట్లు, భాష, శిక్షణ, సంస్కృతులపైన- దాని ప్రభావం ఉంది. నిజానికి మన సమస్త భావజాల క్షేత్రం ఈ స్త్రీ పురుష భేదంతో నిండి ఉంది.

దాని పునాది పితృస్వామ్యంలో ఉంది. అది ఎంత శక్తివంతమైనదీ, ఎంత లోతుగా వేళ్ళూనుకున్నదీ అంటే రాజ్యం రద్దయిపోయిన తర్వాత కూడ అది మన చైతన్యంలో కొనసాగవచ్చు. దానికి వ్యతిరేకంగా శాశ్వత జాగరూకత, నిరంతర నిఘా అవసరం. స్త్రీ పురుష భేదానికి వ్యతిరేకంగా అన్ని సమయాలలోను అంతులేని పోరాటం చేయవలసి ఉంటుంది.

స్త్రీల అణచివేత గురించిన అవగాహనలో ఒక ముఖ్యమైన అంశం కుటుంబ వ్యవస్థ. కుటుంబం ఒక సాంఘిక, ఆర్థిక యూనిట్. స్వంత ఆస్తి విధానం, రాజ్యం రెండూ కుటుంబ యూనిట్‌ను బలోపేతం చేస్తుంటాయి. ఈ యూనిట్ భూస్వామిక అంతరాల వ్యవస్థను కొనసాగించేలా, శక్తివంతం చేసేలా పని చేస్తూ ఉంటుంది. ఆధునిక కుటుంబపు పుట్టుకను, పరిణామాన్ని వివరిస్తూ ఎంగెల్స్, ప్రజల భౌతిక స్థితిగతులలో మార్పులు ఏ విధంగా కుటుంబ సంబంధాల నిర్మాణంపై ప్రభావం వేస్తాయో తెలియజేశాడు. ఎన్నో ప్రేమానురాగ బంధాల ఆకర్షణలతో కుటుంబ వ్యవస్థ స్త్రీలకు ఒక చెరసాలలా మారిపోయింది. ఇటువంటి అసంఖ్యాక ఉద్వేగాల కుహనా జిలుగు వెలుగులతో కుటుంబం సభ్యులందరినీ దుస్సహమైన జీవితానికి కట్టివేస్తుంది. అందరిలోకి ఎక్కువ బాధలకు గురియ్యే వాళ్ళు స్త్రీలు. ఆశ్చర్యకరంగా స్త్రీలే ఈ కుటుంబ వ్యవస్థకు ప్రబలమైన సమర్థకులుగా ఉంటున్నారు. పితృస్వామిక భావజాలంతో నిండిపోయిన కుటుంబ వ్యవస్థ ఇంటి చాకిరీ, పిల్లల పెంపకం వంటి అనేక విధులతో స్త్రీలను బానిసల స్థితికి దిగజార్చింది. కొంత ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సంపాదించినప్పటికీ కూడ, ఈ విధులకు అత్యున్నత ప్రాధాన్యత ఇచ్చినందు వల్ల, స్త్రీలకు మాత్రమే చెందిన సామ్రాజ్యంగా చూసినందు వల్ల, ఇక స్త్రీలకు ఏ మార్గాంతరం లేకుండా పోయింది.

ఇటువంటి దుర్భర స్థితి నుంచి తమను తాము విముక్తి చేసుకునేందుకు స్త్రీలు ఈ పితృస్వామిక భావజాలానికి వ్యతిరేకంగా పోరాటం చేపట్టవలసి ఉంది. ఇంటి చాకిరీని, పిల్లల పెంపకాన్ని సామాజికం చేయవలసి ఉంది. విప్లవానంతర సమాజాలలో స్త్రీలు ఎట్లా ఇళ్ళలోంచి బైటికి వచ్చి సామాజిక ఉత్పత్తిలో పెద్ద ఎత్తున పాల్గొన్నారో పైన చూశాం. స్త్రీలు ఇట్లా బైటికి రావాలంటే ఇంటి చాకిరీ నుంచి, పిల్లల పెంపకం నుంచి తమను తాము విముక్తి చేసుకోవలసి ఉంది. ఈ లక్ష్యం

దిశగా, సోవియట్ యూనియన్‌లోను, చైనా ప్రజారిపబ్లిక్ లోను ఎన్నో రకాల పద్ధతులు ప్రయోగించబడ్డాయి. ఆ పద్ధతులన్నిటి లోనూ ఇంటి పనిని సామాజికం చేసే ప్రయత్నమే కీలకాంశం. పెద్ద ఎత్తున కమ్యూన్లు ఏర్పరచారు. దానితో పాటు వంట పనిని, ఇతర పనులను యాంత్రీకరణ చేయడం జరిగింది. సామూహికంగా చేయ డానికి వీలులేని ఇంటి పనిని కుటుంబ సభ్యులందరూ పంచుకోవడం జరిగింది. తద్వారా ఇంటి పనికి విలువ, గౌరవం సమకూరాయి.

కుటుంబ వ్యవస్థకు కీలకాంశం ఇప్పుడు అమలులో ఉన్న వివాహ వ్యవస్థ రూపం. అది శారీరక, పునరుత్పత్తి, వంశపారంపర్య, ఉద్వేగభరిత యూనిట్‌గా ఉంది. స్త్రీల జీవితాలు పునర్నిర్మించబడాలంటే ఈ వ్యవస్థ నిర్వహణలో మార్పులు రావడం అవసరం. వివాహ వ్యవస్థలో చాల ఎక్కువగా లోపిస్తున్న ఉద్వేగభరిత అంశాన్ని పరిరక్షించవలసి ఉంది. దాన్ని స్థిరమైన సంబంధం కొనసాగించేలా పోషించవలసి ఉంది. స్వంత ఆస్తి రద్దు అయినప్పుడు మాత్రమే వివాహ వ్యవస్థ ఒక వంశ పారంపర్య యూనిట్‌గా రద్దు అవుతుంది.

వివాహ వ్యవస్థలో మార్పులు తెచ్చే ఉద్దేశ్యంతో విప్లవానంతరం సోవియట్ యూనియన్‌లో స్త్రీలకు ఎన్నో సమాన హక్కులు ఇవ్వడం జరిగింది. విడాకుల చట్టం ప్రవేశపెట్టారు. అయితే, సమాజంలో పితృస్వామ్య భావజాలం బలంగా ఉన్నంత కాలం, సమాన హక్కులు, అవకాశాలు అంతిమంగా పురుషుల ప్రయోజనాలకే ఉపయోగపడతాయి. ప్రత్యేకంగా చెప్పాలంటే, విడాకుల చట్టం ఆ దేశంలో దుర్వినియోగమైంది. ఈ లోపాలను అధిగమించడానికి చైనాలో ప్రయత్నం జరిగింది. చట్టపరమైన హక్కులు నిర్దేశించబడ్డాయి. అవి స్త్రీలకు ప్రాధాన్యతను ఇచ్చాయి. దీనితో పాటుగా, స్త్రీ పురుష సమానత్వం గురించిన విషయాలపై విశాల ప్రజానీకాన్ని చైతన్యవంతం చేసేందుకు విస్తృత ప్రచారం జరిగింది. ఇటువంటి ప్రయత్నాలన్నిటినీ చైనా సమాజంలో కొనసాగుతున్న వర్గ పోరాటంతో అనుసంధానించడం జరిగింది.

వివాహ వ్యవస్థలో ఎటువంటి అర్థవంతమైన మార్పు రావాలన్నా దాన్ని ఇప్పుడున్న రూపంలో రద్దు చేయవలసి ఉంది. కుటుంబం రద్దు గురించి మొట్ట మొదటిసారిగా కమ్యూనిస్టు ప్రణాళికలో ప్రతిపాదించిన వాళ్ళు మార్క్స్,

ఎంగెల్స్‌లే ప్రస్తుత దాంపత్య కుటుంబం ఎట్లా కేవలం స్త్రీల విషయంలో ఏక భర్తృత్వంగా ఉన్నదో, పురుషుల విషయంలో ఏక పత్నీత్వంగా లేదో వివరిస్తూ మార్క్స్ ఎంగెల్స్‌లు ఇది అనివార్యంగా సమాజంలో వ్యభిచారానికి, వేశ్యావృత్తికి దారితీసిందో తెలియజేశారు. కేవలం కుటుంబం రద్దుతో మాత్రమే ఆస్తి రహిత వ్యక్తుల మధ్య నిజమైన ప్రేమానురాగాలపై ఆధారపడిన సంబంధాలు రూపొంద గలవు

చివరిగా, స్త్రీల అణచివేత గురించి ఏ చర్చయినా పునరుత్పత్తి సమస్యను ప్రస్తావించకపోతే అసంపూర్ణంగా ఉంటుంది. మార్క్సిజం విప్లవ వర్గానికి అత్యున్నత ప్రాధాన్యత ఇచ్చినప్పటికీ, పునరుత్పత్తి అనే ప్రత్యయానికి మార్క్సిజంలో స్థానం కల్పించబడలేదని తరచుగా అంటున్నారు. లైంగికత, పితృస్వామ్యం అంశాల గురించి స్పష్టత ఈ మధ్యకాలంలోనే వచ్చినప్పటికీ, మౌలిక మార్క్సిజం ఉత్పత్తి, పునరుత్పత్తి భావనలకు కీలక స్థానం ఇవ్వలేదనడం పొరపాటే అవుతుంది. ఇక్కడ ఉత్పత్తి, లైంగికత, మాతృత్వం సమస్యలను క్లుప్తంగా చర్చించడం అవసరం.

పునరుత్పత్తిలో ఉత్పత్తి కూడ కలిసి ఉంది గనుక దానికి కూడ వేతనం ఇవ్వాలని ఒక వాదన వస్తోంది. ఈ వాదనను అంగీకరిస్తే అసలు పునరుత్పత్తి క్రమాన్ని అమానవీయం చేయడానికి దారి తీస్తుంది. ఈ ఉత్పత్తి సాంఘిక రంగంలో జరుగుతుంది గనుక, దీనికి సరుకు విలువ ఉండదు. అంతేగాక "తల్లి హక్కు ఒక సహజ హక్కు". అయితే ఈ సహజ హక్కు మీద సాంఘిక అధికారం ఉండవలసి ఉంటుందా? విప్లవానంతర సమాజాలలో స్త్రీ పునరుత్పత్తి మీద ఒక రకమైన సాంఘికాధికారం ఉండింది. ఈ అధికారాన్ని సోవియట్ యూనియన్‌లో శ్రామిక శక్తిని పెంచడానికి, చైనాలో వనరులను కేటాయించడం కోసం శ్రామిక శక్తిని తగ్గించడానికి వాడుకున్నారు అయితే, ఇక్కడ గుర్తించవలసిన అంశం ఏమంటే పునరుత్పత్తి హక్కు ఒక సహజమైన హక్కు గనుక, దాని మీద సాంఘికాధికారం ఉండవలసి ఉంటే (ఉదాహరణకు జాతి అభివృద్ధి కోసం) అప్పుడు ఈ విషయం నిర్ణయంలో స్త్రీల అభిప్రాయానికి స్థానం ఉండాలి.

లైంగికత స్త్రీలకు తమ శరీరాల మీద తమకే అధికారం ఉండాలని అంటుంది. కాని వాస్తవంలో స్త్రీల లైంగికతను పురుషులు అదుపు చేస్తున్నారు. పురుషుల

కోరికలను, కాంక్షలను, అవసరాలను తీర్చడానికి స్త్రీల లైంగికత ఉపయోగపడుతోంది. ఈ అదుపు గర్భనిరోధం, పునరుత్పత్తి నియంత్రణ, గర్భస్రావ చట్టాలు వంటి రూపం తీసుకున్నా, స్త్రీల మీద హింస రూపం తీసుకున్నా (బూతు సాహిత్యం, కళలు, లైంగిక వేధింపు, అత్యాచారం, స్త్రీలను కొట్టడం మొదలైనవన్నీ హింసా రూపాలే), దానిలో ప్రత్యేకంగా క్రూర అధికార ప్రవర్తన ఉంటుంది. అది స్త్రీలకు వ్యతిరేకంగా పని చేస్తుంది.

స్త్రీల 'విధేయత', 'సౌశీల్యత' భావాలు లోతుగా స్వంత ఆస్తి వ్యవస్థతో సంబంధంలో ఉండగా, ఈ పరిస్థితి నుంచి బైటపడే ప్రయత్నం లైంగిక స్వేచ్ఛ భావనకు దారి తీసింది. ఇక్కడ కూడ మనం ఉన్న సమాజం తీవ్రమైన అసమానతలతో ఉన్నందు వల్ల, స్త్రీ లైంగిక స్వేచ్ఛ కోరదగినదే అయినప్పటికీ, చివరికి పురుషులకు ప్రయోజనకారిగా మారిపోతుంది. సమానంగా స్వతంత్రులైన స్త్రీ పురుషులు మాత్రమే నిర్బంధ రహితమైన, స్వేచ్ఛాయుతమైన లైంగిక సంబంధాలు ఏర్పరచుకోగలుగుతారు. మానవులలో లైంగిక అవసరాలు కేవలం సహజమైనవి మాత్రమే కాదు, అవి సాంస్కృతికంగా నిర్ణయింపబడేవి. నిజమైన విప్లవ లైంగికత కేవలం వర్గ పోరాట క్రమంలో మాత్రమే సాధ్యమవుతుంది.

'మాతృత్వం' అనేది పితృస్వామిక అధికారాన్ని నిరంతరం బలోపేతం చేసే, శక్తివంతం చేసే అద్భుతమైన కట్టుకథ. చారిత్రకంగా, తాము 'మాతృత్వ ప్రవృత్తి' తో పుట్టామని స్త్రీలను నమ్మించడం జరిగింది. సగటు స్త్రీలందరూ తమంతట తాము ఒక శారీరక శిశువును కనాలనే కోరికను కలిగి ఉంటారనే అర్థంలో గాని, గర్భం దాల్చినప్పుడూ ఆ తర్వాతా తల్లిని తన బిడ్డ వేపు తప్పనిసరిగా ఆకర్షించే హార్మోన్ ఆధారిత కాంక్షలు ఉంటాయనే అర్థంలో గాని ఈ 'మాతృత్వ ప్రవృత్తి' అనేదేదీ లేదు. అందుకు భిన్నంగా, ఈ ప్రవృత్తి సాంస్కృతికంగా కల్పించబడింది. ఈ నిర్మాణానికి లక్ష్యం అణచివేత. ఇది తరచుగా తల్లికీ బిడ్డకూ మధ్య నిర్బంధ పూరిత సంబంధంగా మారుతోంది. మనదేశంలో అత్యున్నత గౌరవనీయమైన 'మాతృమూర్తి' హోదాకు కీలక స్థానం ఉన్నప్పటికీ, చాల ఎక్కువగా దానికి అర్థం ఆమెకు చాల పరిమితమైన, రెండోస్థాయి పాత్ర ఇవ్వడమే. ఈ పాత్ర భార్యగా, తల్లిగా ప్రధానంగా పిల్లల్ని కనడానికి, సంతానాన్ని పరిరక్షించడానికి మాత్రమే పరి

మితమై ఉంది. పితృస్వామ్యం నిరంతరం ఈ పరిమిత పాత్రను బలోపేతం చేస్తూ, తమ ఏకైక వృత్తి తల్లిగా ఉండడం మాత్రమే అని స్త్రీలు నమ్మేలా చేస్తుంది. స్త్రీలూ పిల్లలూ గనుక తమను తాము విముక్తం చేసుకోవాలంటే ఈ 'మాతృత్వం' కల్పనను శక్తివంతంగా ఎదుర్కోవాలి, ధ్వంసం చేయాలి.

మౌలిక మార్క్సిజం మనకు స్త్రీల అణచివేత విషయంలో ఎన్నో లోతయిన దృక్కోణాలను అందజేసినప్పటికీ, అది ఈ సమస్యను వివరమైన పద్ధతిలో చర్చించ లేదు. చాల తరచుగా, ఇతర వివరణాత్మక భావనల మీద శ్రద్ధ తగ్గేంతగా, వర్గ భావన మీద అతిగానూ, ఏక పక్షంగానూ ప్రాధాన్యత ఉంటూ వచ్చింది. ఈ మధ్య కాలంలో ఫెమినిస్టు సిద్ధాంతం పితృస్వామ్యం, స్త్రీ పురుష భేదం, మాతృత్వం అంశాలను శక్తివంతమైన పద్ధతిలో లేవనెత్తింది. స్త్రీ సమస్య విషయంలో మార్క్సిస్టు లెనినిస్టు ఉద్యమాలూ, పార్లమెంటరీ వామపక్షాలూ కూడ చూపిన అసమగ్ర శ్రద్ధతో ఈ సమస్యను పట్టించుకోవడంలో మార్క్సిస్టు భావనలు సరిపోవనే ఒక తప్పుడు అభిప్రాయం ప్రచారంలోకి వచ్చింది. ఫెమినిస్టు దృక్పథంలో కొన్ని మౌలిక భావనాత్మక లోపాలు ఉన్నప్పటికీ, స్త్రీ సమస్యను అర్థం చేసుకోవడంలో ఫెమినిస్టులు చేసిన చేర్పులను నిరాకరించడానికి వీలులేదు. అయితే, వాళ్ళు చాల భావనలను స్వంత ఆస్తి వ్యవస్థ నుంచి, రాజ్యాంగ యంత్రం నుంచి వేరు చేసి చూస్తారు. ఈ ప్రధానమైన సంబంధం పట్ల స్పష్టత కలిగి ఉండే మార్క్సిస్టులు ఫెమినిజం ప్రకటించిన ఎన్నో భావనాప్రత్యయాలను సమగ్రంగా విశ్లేషించలేదు. రాజ్యాంగ యంత్రం పాత్రకు ప్రధాన స్థానం ఇవ్వకపోవడం అనే ఫెమినిస్టు పరిమితికి చాల ముఖ్యమైన పరిణామాలున్నాయి. పితృస్వామ్యంగాని, దాని అనుబంధ వ్యవస్థలు గాని రాజ్యాంగ యంత్రానికి విడిగా మనుగడలో ఉండవు, పని చేయవు అందువల్ల వాటికి వ్యతిరేకంగా జరిగే ఏ పోరాటమైనా తప్పనిసరిగా రాజ్య వ్యతిరేక కార్యక్రమాన్ని కలిగి ఉండవలసి ఉంటుంది. ఈ కార్యక్రమానికి కీలకాంశంగా ఉండవలసింది సాంఘికార్థిక పునాదిని, సమాజంలోని వేర్వేరు దోపిడీ నిర్మాణాలను మార్చే పోరాటం. నూతన ప్రజాస్వామ్యం కోసం జరిగే పోరాటం స్త్రీల విముక్తి కోసం జరిగే పోరాటం కూడ. అది స్త్రీల జీవితాలలోకి ప్రజాస్వామిక హక్కులను తీసుకొస్తుంది. భూస్వామిక వ్యవస్థలో, సంస్కృతిలో వ్యక్తమయ్యే పితృస్వామ్యానికి వ్యతిరేకంగా పోరాటాన్ని నూతన ప్రజాస్వామిక విప్లవ క్రమంలో భాగంగా చేపట్టవలసి ఉంటుంది. ఈ

పోరాటాన్ని విప్లవ క్రమంలోనూ, విప్లవం తర్వాత కూడా కొనసాగించవలసి ఉంటుం దని నొక్కి చెప్పవలసి ఉంది. ఇది జరగనంతవరకు ఈ కార్యక్రమం విఫలమవుతూనే ఉంటుంది.

సమకాలీన సమాజంలో, వర్గ పోరాట వాస్తవికతను ఎదుర్కొంటున్న రాజ్యం, వర్గ పోరాటాన్ని నీరు గార్చేందుకు గాను వేరు వేరు బృందాల ఫిర్యాదు లను పోటీగా పెడుతోంది. ఈ బృందాల ఫిర్యాదులు మార్క్సిస్టు నిర్లక్ష్యం చేసినందు వల్ల, విప్లవ శక్తులుగా మారగలిగిన ఎన్నో బృందాలు ఫెమినిస్టు ఆలోచనా ధార తోకో, మార్క్సిస్టేతర ఆలోచనా ధారలలోకో వెళ్ళిపోయాయి. ఈ క్రమంలో రాజ్యం, సామ్రాజ్య వాదం కూడ ప్రోత్సాహకాలుగా పని చేశాయి. ఈ విషయాల గురించి పునరాలోచించవలసిన బాధ్యత, స్త్రీల అణచివేత స్వభావం గురించి లోతుగా విశ్లే షించే క్రమాన్ని రూపొందించవలసిన బాధ్యత, తగిన వ్యూహాన్ని అభివృద్ధి చేయ వలసిన బాధ్యత మార్క్సిస్టులుగా మనపైన ఉన్నాయి. స్త్రీల విషయంలో మార్క్సి జం ఇవ్వగల ప్రధానమైన హామీలలో ఒకటి, కొందరిని బానిసలుగా, కొందరిని యజ మానులుగా మార్చే అన్ని భేదాలను రద్దు చేసేలా మానవ స్వభావాన్ని పునర్నిర్మిస్తా నని అది చేసిన వాగ్దానం. ఈ విముక్తి సూత్రం నిజంగా పని చేయాలంటే మనం పితృస్వామ్యం, లైంగికత, స్త్రీ పురుష భేదం, పునరుత్పత్తి, వర్గ అణచివేత విశ్లేషణ అంశాల మీద కేంద్రీకరించి, వాటినన్నిటినీ మార్క్సిస్టు సైద్ధాంతిక చట్రపు ప్రధాన వ్యవస్థలో సమ్మిళితం చేయాలి. నిజమైన చారిత్రక భౌతిక వాద శాస్త్రం చెప్పేదంతా దాని గురించే.

[1993 మే లో అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి జరప తలపెట్టిన 'స్త్రీ విముక్తి పోరాటం' సదస్సుకు అవగాహనా పత్రాన్ని సమర్పించవలసిందిగా ఎ ఐ ఎల్ ఆర్ సి కార్యవర్గం విరసంను కోరింది. 1993 జనవరిలో గుడివాడలో జరిగిన విరసం సర్వ సభ్య సమావేశం ఈ విషయం గురించి ఒక రోజు ప్రత్యే కంగా వివరమైన చర్చ జరిపింది. ఈ చర్చ మినిట్స్ ఆధారంగా అవగాహనా పత్రాన్ని తయారుచేసే బాధ్యత ముగ్గురు సభ్యుల కమిటీకి అప్పగించడం జరిగింది. ఈ పత్రాన్ని తొలి దశలో కమిటీ గుంటూరు లోను, ఆ తర్వాత కమిటీ, ఎ ఐ ఎల్ ఆర్ సి సదస్సు నిర్వాహక కమిటీ కలిసి నాగాపూర్ లోను చర్చించి నిర్ధారిం చాయి. పైన అనువదించిన పత్రం ఇట్లా నిర్ధారించిన పత్రం. ఈ పత్రం పైననే డిహార్

నారీ సంఘర్ష్ సమితి విమర్శను ప్రకటించింది. ఈ సంచికలోనే ఆ విమర్శ కూడ అచ్చవుతోంది. అయితే సదస్సు వేదిక మీద సమర్పించబోయే ముందుగా, సదస్సు ముందురోజు జరిగిన ఎ ఐ ఎల్ ఆర్ సి కార్యవర్గం, పత్రంలో మరి కొన్ని మార్పులు సూచించింది. ఆ సూచనల ప్రకారం :

* పై పత్రంలో రెండో పేరాను తొలగించడం జరిగింది.
* మూడో పేరాలో 'స్వాతంత్ర్యానంతర కాలంలో' బదులుగా '1947 అధికార మార్పిడి తర్వాత' అని చదువుకోవాలి.
* నాలుగో పేరాలో 'ఐతే ఈ సంఘాలు....' నుంచి ఆ పేరా చివరివరకు తొలగించాలి.
* తొమ్మిదో పేరా ప్రారంభంలో 'ఈ అంశంపై.... ఇవ్వనప్పటికీ' బదులుగా 'ఈ అంశంపై మార్క్సిస్టు సిద్ధాంతంతో పాటుగా' అని చదువుకోవాలి.
* పదో పేరా చివర 'రాజ్యం రద్దయిపోయిన.... చేయవలసి ఉంటుంది' బదులుగా 'అది మన చైతన్యంలో చాల కాలం ఉండే అవకాశం ఉంది. కనుక స్త్రీ పురుష భేదానికి వ్యతిరేకంగా అన్ని స్థాయిలలోను నిరంతర పోరాటం చేయవలసి ఉంటుంది' అని చదువుకోవాలి.
* పదిహేనో పేరాలో రెండో వాక్యంలో 'కుటుంబం రద్దు' అనే బదులు 'ప్రస్తుత రూపపు కుటుంబం రద్దు' అని చదువుకోవాలి ఆ పేరాలోనే చివరి వాక్యంలో కూడ 'కుటుంబం రద్దు' బదులు 'ప్రస్తుత రూపపు కుటుంబం రద్దు' అని చదువుకోవాలి.
* పదహారో పేరాలో రెండో వాక్యంలో 'అంటున్నారు' బదులు 'విమర్శిస్తున్నారు' అని చదువుకోవాలి.
* పందొమ్మిదో పేరాలో మూడో వాక్యంలో 'స్వేచ్ఛాయుతమైన' బదులు 'సమానమైన' అనీ, ఐదో వాక్యంలో 'లైంగికత' బదులు 'సమగ్ర కుటుంబ సంబంధాలు' అనీ చదువుకోవాలి.
* ఇరవై ఒకటో పేరాలో ఏడో వాక్యంలో 'విశ్లేషించలేదు' బదులు 'విశ్లేషించవలసే ఉంది' అని చదువుకోవాలి.

మొదటి పాఠం మీద విమర్శ అచ్చువేసినప్పుడు, రెండో పాఠం (సవరించిన పాఠం) అచ్చువేయడం సముచితం కాదనే ఉద్దేశంతో మొదటి పాఠాన్ని యథాతథంగా వేసి ఈ సవరణలు ప్రకటిస్తున్నాం — సం॥]



# సోషలిజంలో మాత్రమే నిజమైన స్త్రీ విముక్తి సంభవం

సెమినార్‌లో ప్రవేశపెట్టిన "స్త్రీ విముక్తి - వర్గ పోరాటం" అనే వ్యాసం మౌలిక ఆలోచనతో మాకు ఏకీభావం లేదు. ఆ వ్యాసంతో మాకు ఉన్న విభేదాలను ఈ క్రింద ప్రకటిస్తున్నాం.

| సెమినార్ పత్రపు దృక్పథం | మా దృక్పథం |
| --- | --- |
| 1. కేవలం అగ్రవర్గ, అగ్రావర్ణ, పితృస్వామ్యాన్ని కూలదోయడంతోనే మహిళా విముక్తి సాధ్యమవుతుందని వాళ్ళంటారు. | 1. దేశ విదేశ దోపిడీ వర్గాల అంటే సామ్రాజ్యవాద, భూస్వామ్య, దళారీ పెట్టుబడిదారీ, పితృస్వామ్యాలను కూలదోసి నూతన ప్రజాస్వామిక వ్యవస్థను స్థాపించి, అంతిమంగా సోషలిస్టు వ్యవస్థను స్థాపించినప్పుడు మాత్రమే స్త్రీ విముక్తి సాధ్యమవుతుంది. ఈ వర్గ దృక్పథాన్ని వదిలి దాని స్థానంలో అగ్ర వర్గ, అగ్రకులాలను శత్రువులుగా చెప్పడం పూర్తిగా తప్పు. |
| 2. వాళ్ళు చూపదలిచిందేమంటే స్త్రీ సమస్యకు మూలం పురుష దోపిడీ పీడనల్లోనే ఉందని. అందువల్ల పురుష దోపిడీ పీడనలకు వ్యతిరేకంగా పోరాడడమే స్త్రీల ప్రధాన కర్తవ్యమవుతుంది. వాళ్ళు ఇంకా చెప్పేదేమిటంటే స్త్రీలు మౌలికంగా వర్గరూపేణ కాక పురుష రూపేణ పీడింపబడుతున్నారట. అంటే స్త్రీ | 2. మేం చెప్పేదేమంటే సమాజంలో వ్యక్తిగత ఆస్తి, వర్గాలు పుట్టుకు రావటంతో పాటుగానే పురుష పీడన, ఆధిపత్యం ప్రారంభమయ్యాయి. అంటే స్త్రీ సమస్యకు మూలకారణం వ్యక్తిగత ఆస్తి, వర్గ దోపిడీ పీడన మాత్రమే. దోపిడీపై ఆధారపడిన సమాజంలో స్త్రీలు వర్గగత రూపంలోనే పీడితులుగా ఉంటారు. కష్ట జీవులైన స్త్రీలకూ పురుష |

లను పురుషులే శత్రువులన్నమాట.

లకూ మధ్య విరోధం ఉన్నమాట నిజమే కానీ ఆ విరోధం శత్రువైరుధ్యం కాదు. ఆ వైరుధ్యాన్ని వీలయినంతవరకు చర్చల ద్వారానే పరిష్కరించాలి.

3. వాళ్ళు పితృస్వామ్యానికి, లైంగిక పీడనకు, కుటుంబ పీడనకు, వివాహ వ్యవస్థకు, పిల్లల పెంపకానికి తదితరాలకూ వ్యతిరేకంగామాట్లాడుతూ చివరికి "ఫ్రీ సెక్స్" లేదా "స్వేచ్ఛా లైంగిక సంబంధం" లను ప్రబోధిస్తున్నారు.
("ఓన్లీ మెన్ అండ్ విమెన్ హూ ఆర్ ఈక్వల్లీ ఫ్రీ క్యాన్ ఫామ్ నాన్ రిప్రెసివ్ అండ్ ఫ్రీ సెక్సువల్ రిలేషన్ షిప్.")

3. మేం పురుషాధిపత్యాన్ని వ్యతిరేకించే పేరుతో ఫ్రీ సెక్స్‌ను లేదా స్వేచ్ఛా లైంగిక సంబంధాన్ని ప్రబోధించే ప్రతిపాదనను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాం. మేం ఉన్నత ఆదర్శాలతో, ఉన్నత ఆలోచనలతో సమాన గౌరవ అధికారాలతో ఉత్పత్తి కార్యక్రమాల్లో భాగం పంచుకుంటూ ఒక ఉన్నత సాంస్కృతిక, ఉన్నత ఆశయాలపైన ఆధారపడిన స్త్రీ పురుష సంబంధాలు, కొత్త నీతితో కూడిన వివాహ సంబంధాన్ని స్థాపించ దలుచుకున్నాము.

మేం పెట్టుబడిదారీ కుటుంబాన్ని కుటుంబ పీడనను, బూర్జువా వివాహ వ్యవస్థను, లైంగిక పీడనను, ప్రజాస్వామిక సోషలిస్టు సమాజ స్థాపనతోనే క్రమంగా తొలగించవచ్చునని భావిస్తున్నాం.

4. వాళ్ళు పితృస్వామిక ఉత్పత్తి వ్యవస్థ గురించి చర్చిస్తూ పైన చెప్పిన అంశాలను తొలగించడంలో మార్క్సిజం సరైన మార్గ నిర్దేశం చేయడంలో విఫలమైందని అన్నారు. లెనిన్ స్టాలిన్, మావోల

4. ఇది భ్రమలు గొలిపే తప్పుడు సిద్ధాంతముగా మేం భావిస్తున్నాం.

లెనిన్, స్టాలిన్, మావోల ద్వారా నిర్మితమైన సోషలిస్టు సమాజాల్లో స్త్రీలకు అన్నిరకాల విముక్తి కల్పించేందుకు సరైన ప్రయత్నాలు జరిగాయి.

సోషలిస్ట్ సమాజాలలో కూడా పురుష ప్రధాన వ్యవస్థ ఉందిందని కూడా వాళ్ళన్నారు. దాన్ని ఆ నాయకులు తొలగించలేకపోయారని కూడా అన్నారు. ఇప్పుడు వాళ్ళేమంటారంటే పితృస్వామ్యేతర మార్గాన్ని ఆవిర్భవింప చేసి దాని సాయంతో పురుషాధిపత్యాన్ని మార్చాలట.

వాటిని రివిజనిస్టులు ఆపివేసారు.

ఉత్పత్తి వ్యవస్థను వర్గ దృక్కోణం నుంచి చూడకుండా పురుష ప్రధానం అనే కోణం నుంచి చూడడం మార్క్సిస్టు వ్యతిరేకం.

5. సోషలిస్టు వ్యవస్థ స్థాపనతోనే స్త్రీలకు అన్నిరకాల విముక్తి సాధ్యమవుతుంది-అనే విషయంలో వాళ్ళు సందేహం వ్యక్తం చేసారు.

5. మా అభిప్రాయంలో సోషలిజంలో మాత్రమే నిజమైన స్త్రీ విముక్తి సంభవమవుతుంది. అయితే సోషలిస్టు వ్యవస్థ నిర్మించడంతోపాటుగానే వెంటనే అన్ని సమస్యలూ పరిష్కారం కావు. దాని కోసం ఒక దీర్ఘకాలిక పోరాటంలో సోషలిజంలో మునుముందుకు సాగుతూ క్రమంగా స్త్రీ విముక్తిని సాధించడం వీలవుతుంది.

6. మనకు మార్క్సిజం చాలా విషయాలలో అవగాహన నిచ్చినప్పటికీ స్త్రీల పీడన విషయంలో ఏ విశ్లేషణను ఇవ్వలేదని వాళ్ళంటారు. వాళ్ళ కథనం ప్రకారం మార్క్సిజంలో రెండో శ్రేణి అంశాలను అప్రధానంగా చూస్తూ అవసరం కన్న ఎక్కువగా ఏకైకం అనే పద్ధతిలో వర్గ పోరాటానికి ప్రాధాన్యత ఇవ్వడం జరిగింది.

6. స్త్రీల సమస్యతో సహా అన్ని సామాజిక సమస్యలను పరిష్కరించడానికి సైద్ధాంతిక ఆధారం మార్క్సిజం అని మా అభిప్రాయం.

మార్క్సిజం ఆధారంగా వర్గ పోరాటాన్ని కొనసాగిస్తూ రెండో శ్రేణి సమస్యలను పట్టించుకోవడం సంభవమే. మార్క్సిజం ఏకైకమనే పద్ధతిలో అవసరంకన్న ఎక్కువగా వర్గ పోరాటానికి ప్రాధాన్యత ఇచ్చిందన్న ఆరోపణను మేం తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాం.

7. వ్యాసశీర్షిక 'స్త్రీ-విముక్తి - వర్గ పోరాటం' అని ఉన్నప్పటికీ ఈ వ్యాసంలో వర్గ దోపిడీ గురించి, వర్గ పోరాటం గురించీ ఏ మాత్రమైనా చెప్పడం జరగలేదు.

మహిళా ఆందోళనను కార్మిక, కర్షక విప్లవకర వర్గపోరాట పథం నుంచి వేరుచేసి చూపడమే వాళ్ళ దృక్పథం.

7. వర్గ పోరాట పథం నుంచి వేరుచేసి స్త్రీ సమస్యను చర్చించడం, విశ్లేషించడం అంటే అర్థం బూర్జువా దృక్పథానికి బలైపోవడమే అని మా అభిప్రాయం.

8. ఈ వ్యాసం ద్వారా శ్రామిక వర్గ దృక్పథం స్థానంలో బూర్జువా దృక్పథం నుంచి స్త్రీ సమస్యను, స్త్రీ సమస్య అనే ముసుగులో కేవలం బూర్జువా స్త్రీల కోర్కెలను ప్రతిపాదించడం జరిగింది.

8. మా అభిప్రాయం ప్రకారం శ్రామిక వర్గ దృష్టి కోణంనుంచి కష్టజీవులైన స్త్రీల కోర్కెలనూ, సమస్యలనూ తీసుకొని వ్యాసంలోని మౌలిక విషయం ఉండాలి. అప్పుడు మాత్రమే వర్గపోరాటంతో స్త్రీ సమస్యను సరిగా జోడించడం సాధ్యమవుతుంది.

—బీహార్ మహిళలు

తెలుగు అనువాదం : ఎన్. వేణుగోపాల్



---

# స్త్రీ విముక్తి - వర్గ పోరాటం - మన దృక్పథం

స్త్రీ సమస్యలపై ఈ మధ్య కాలములో ఎన్నడూ లేనంతగా చర్చలు ప్రారంభమై కొనసాగుతున్నాయి. రాజకీయ పార్టీల దగ్గర్నుండి స్వచ్ఛంద సంస్థలు, అభ్యుదయ మహిళా సంఘాలు, ఫెమినిస్టులు, మేధావులు స్త్రీల సమస్య గురించి భారతదేశ వ్యాపితంగా తరతమ స్థాయిలో చర్చలు కొనసాగిస్తున్నారు. ఇంతగా ఇన్ని రకాలుగా మహిళల సమస్యల గురించి చర్చించడానికి కారణాలేంటి ? గత రెండు దశాబ్దాలుగా దేశంలోనూ, ప్రత్యేకించి ఆంధ్ర రాష్ట్రములోనూ, దిన దినం పెంపొందుతున్న వర్గ పోరాటమూ, ప్రజాస్వామిక విప్లవమూ, అన్ని సాంఘిక సమస్యల్ని ఎజెండాలోనికి తెచ్చినట్లే స్త్రీ సమస్యను కూడా వెలుగులోకి తెచ్చింది. ఈ నేపథ్యంలోనే ఈ రోజు స్త్రీ సమస్య ముందుకు రావటానికి గల కారణములు చూడాలి తప్ప, కొందరు వ్యక్తుల్లో, సంఘాల్లో ఈ చర్చ ముందుకు రావటానికి గల కారణం అనుకోవటం సరైనది కాదు. ఏ సమస్య అయినా ముందుకు రావటానికి అంతర్గత అంశాలే ప్రధాన కారణాలు తప్ప, బహిర్గత అంశాలు కావని మార్క్సిజం చెప్తుంది.

గత రెండు దశాబ్దాలుగా మనదేశం ముందెన్నడూ లేనంతగా తీవ్ర సంక్షోభపు సుడిగుండంలో చిక్కుకుని పోయివుంది. రోజురోజుకూ మరింత తీవ్రతరమవుతున్న ఈ సంక్షోభం ప్రభావం దేశ ఆర్థిక వ్యవస్థనూ, రాజకీయ పునాదులనూ కుదిపివేస్తూ ఆకలి, ద్రవ్యోల్బణం, నిత్యావసర సరుకుల రేట్ల పెరుగుదలకూ కారణమైంది. దేశంలో సగభాగమైన మహిళలపై కూడా ఈ సంక్షోభ భారం పడి తీవ్రమైన ప్రభావాన్ని కలిగిస్తోంది. గ్రామీణ ప్రాంతాల్లో పేదరికం కారణంగా పట్టణాలకు తరలిపోవడం, జీవనోపాధి కోసం విదేశాలకు వెళ్ళడం, వేతనాలలో అసమానత్వం, భర్తలను కోల్పోవటం, విడాకులు వంటి ఆర్థిక, సామాజిక కారణాల వల్ల నిరుపేద మహిళల సంఖ్య రోజు రోజుకూ పెరుగుతున్నది. ఈ సంక్షోభం వల్ల పై సమస్యలతో పాటు అనాదిగా స్త్రీలు ఎదుర్కొంటున్న అదనపు సమస్యలు కూడా తీవ్రతరమై వాటికి వ్యతిరేకంగా కూడా ఇంకే మాత్రం ఉపేక్షించటానికి వీలు లేకుండా పోరాటంలో పాల్గొనవలసిన పరిస్థితికి నెట్టబడుతున్నారు స్త్రీలు. ఇలా పోరాటములోనికి వచ్చిన మహిళల మహిళా సమస్య ప్రాధాన్యత రోజు రోజుకూ పెరుగు

తున్నది. ప్రతి ఒక్క పార్టీ, ప్రతి ఒక్కరూ మహిళా సమస్య ప్రాధాన్యతను దానిపట్ల తమ వైఖరిని నొక్కి చెప్పకుండా వుండలేని పరిస్థితికి నెట్టబడ్డారు.

నిజానికి స్త్రీల సమస్యలు ప్రత్యేకంగా ఎజెండాలోనికి వచ్చింది పారిశ్రామిక విప్లవం తర్వాతే. అంతవరకు ప్రధానంగా గృహ ఉత్పత్తికీ, పాక్షికంగా వ్యవసాయరంగపు పనులకీ పరిమితమైన రైతాంగ స్త్రీలు, పారిశ్రామిక విప్లవం తర్వాత అనివార్యంగా ఫ్యాక్టరీలలోనికి నెట్టబడ్డారు. ఆమె ఇక వ్యక్తిగా ఎంతమాత్రము లేదు. కార్మిక శక్తిగా మారిపోయింది. బూర్జువా విప్లవాలు కూడా స్త్రీల పరిస్థితిలో విప్లవాత్మకమైన మార్పులను తీసుకువచ్చాయి. ఉన్నత, మధ్యతరగతి స్త్రీలు తమ భర్తల బూర్జువా భావజాలానికి వ్యతిరేకంగా పోరాడటానికి ముందుకు వచ్చారు.* అప్పటి నుండీ కూడా వివిధ రకాల సంస్థలూ, వ్యక్తుల తమ తమ తాత్విక పునాదుల కనుగుణ్యంగానే మహిళల సమస్యను విశ్లేషించటం, పరిష్కారాన్ని సూచించడం జరుగుతోంది.

అయితే ఎన్ని రకాలుగా సంస్థలు, వ్యక్తులూ స్త్రీ సమస్యను విశ్లేషించినా, పరిష్కారమార్గాలు చూపినా అవేవీ కూడా స్త్రీ సంపూర్ణ విముక్తిని సాధించడం ఎలా అనేది సమగ్రంగా చెప్పలేకపోయాయి. మొట్టమొదటిసారిగా స్త్రీ సంపూర్ణ విముక్తిని గురించిన సమగ్రమైన పరిష్కారాన్ని అందించినది మార్క్సిజం. ప్రకృతిని అందులోని వస్తువుల విషయాలను పరస్పరం సంబంధం కలిగినవిగా ఒకదానిపై మరొకటి ప్రభావం చూపుకునేవిగా మార్క్సిజం గుర్తిస్తుంది మార్క్సిజం సమగ్రమైనది, వాస్తవమైనది, శాస్త్రీయమైనది. మార్క్సిజం పీడిత ప్రజల విముక్తిని, స్త్రీ విముక్తిని విడివిడిగా చూడదు. పీడిత ప్రజల విముక్తిలో అంతర్భాగంగానే స్త్రీలు విముక్తిని సాధించగలరని చెప్తుంది. వాటి రెంటికీ మధ్య గతితార్కిక సంబంధాన్ని చెప్తుంది. మొట్ట మొదటిసారిగా స్త్రీ అణచివేత పట్ల, దాని మూల కారణాల పట్లా, స్త్రీ సమస్యల పట్ల ఒక శాస్త్రీయమైనది దృక్పథాన్ని అందించింది మార్క్సిజం. అలాగే అసలు స్త్రీలకంటూ కొన్ని ప్రత్యేక సమస్యలున్నాయి కాబట్టి, దానికి ప్రత్యేకమైన పరిష్కారాలని కనుగొని, వాటిని ఆచరణలోనికి తేవడానికి ప్రయత్నించినది కూడా మార్క్సిస్టులే.

---

*నిజానికి అప్పటినుండి కూడా స్త్రీల సమస్య చర్చనీయాంశంగా ఉంది.

తరతరాలుగా స్త్రీల అణచివేతకు గల మూల కారణములు ఏమిటి ? రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిస్థితులను దృష్టిలో పెట్టుకోకుండా వాటి గురించి క్షుణ్ణంగా అర్థం చేసుకోకుండా స్త్రీల అణచివేతను విశ్లేషించలేము.

ఆ యా సమాజాలలోని వుత్పత్తి విధానాలపై ఆధారపడి, కుటుంబమూ, వివాహమూ, మతము, సంస్కృతి, నాగరికత, రాజ్యమూ, రాజ్యాంగమూ మొదలైన పుపరితల అంశాలు మనగలుగుతున్నాయి. కాబట్టి ఆ యా సమాజాలలోని వుత్పత్తి విధానానికి అనుకూలంగా వివాహము, కుటుంబ వ్యవస్థ ఎలా మారాయి అనేది మనం అధ్యయనం చేయాలి.

స్త్రీలు ఆదిమ సమాజంలో ఆధిపత్య స్థానంలో ఉండేవారు. మాతృస్వామిక వ్యవస్థలో స్త్రీలు గణానికి నాయకత్వం వహించేవారు. వేటగో పాల్గొనేవారు. గణం పోషణ రక్షణ ఆమె బాధ్యతగా ఉంది. గుంపు పెళ్ళి వ్యవస్థలో ఉండటం వలన సంతానం తల్లి ద్వారానే గుర్తించబడినది. పశుపోషణ, వ్యవసాయం అభివృద్ధి చెందటంతో స్త్రీ, పురుషుల మధ్య పని విభజన జరిగినది. వేటాడటం, వ్యవసాయం మగవాళ్ళ పనిగా, ఇంటినీ, పిల్లలనీ చూడటం, పశుపోషణ స్త్రీల బాధ్యతగా మారింది. ఒకనాడు అవసరం కోసమే ఈ విభజన జరిగింది. వ్యవసాయానికి ప్రాధాన్యత పెరగడంతో ఉత్పత్తిలో ప్రధాన పాత్ర పురుషునిదీ, రెండవ పాత్ర స్త్రీలదీ అయిపోయింది. క్రమంగా మాతృస్వామిక స్థానంలో పితృస్వామికం వచ్చింది. పితృస్వామిక సమాజం బలపడటానికి ప్రధాన కారణం స్వంత ఆస్తి ఏర్పడటమే. తన ఆస్తి తన వారసులకే చెందాలనుకున్న పురుషుడు గుంపు పెళ్ళిలో అది సాధ్యం కాదు కాబట్టి, గుంపు పెళ్ళి స్థానంలో దంపతీ కుటుంబ వ్యవస్థను బలంగా ముందుకు తీసుకు వచ్చాడు. సమాజ అభివృద్ధితో పాటూ, దంపతీ కుటుంబ లక్షణములు బల పడిన కొద్దీ తండ్రి అధికారం బలపడింది. ఏంగెల్స్ మాటల్లో చెప్పాలంటే, "తల్లి హక్కును రద్దు చేయటమనేది స్త్రీ జాతికి సంబంధించి ప్రపంచ చారిత్రక ప్రాముఖ్యం కలిగిన ఘోర పరాజయమని చెప్పాలి. ఇంట్లో కూడా మగవాడు పెత్తనం సంపాదించాడు. స్త్రీ పరాభవం పొందింది. మగవాని కామానికి బానిస చేయబడింది. పిల్లల్ని కనే యంత్రముగా మార్చబడింది." (కుటుంబ, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగం పుట్టుక). స్త్రీ కుటుంబ, సామాజిక అణచివేతకు గురవుతూ,

సామాజిక వుత్పత్తితో సంబంధం లేకుండా ఇల్లు, సాంప్రదాయాలు, కట్టుబాట్లతో బంధించబడింది. పురుషాధిక్యత ఒక తండ్రో, ఒక భర్తో, ఒక కొడుకో కూర్చుని ఆలోచించి అమలు చేసినది కాదు. అది ఆస్తి హక్కు తలెత్తిన నాటి నుండి, దంపతీ కుటుంబ వ్యవస్థ ఏర్పడిన నాటి నుండి వస్తున్న పెత్తనం. వర్గాలు, వర్గ దోపిడీ ఉన్నంతవరకు ఉండే పెత్తనం.

మహిళా సమస్య ఎప్పుడూ సామాజికంగానే వ్యక్తమౌతుంది. మానవాళి మొదటిసారిగా వర్గాలుగా విభజింపబడిన నాటి నుండి చరిత్రంతా వర్గ వైరుధ్యాల వర్గ పోరాటాల చరిత్రే. "ఏకపత్నీ వివాహ వ్యవస్థలో స్త్రీ పురుషుల మధ్య వైరుధ్యం, మొట్ట మొదటి వర్గ వైరుధ్యం ఏక కాలంలో తలెత్తాయి" (ఎంగెల్స్- కుటుంబమూ, వ్యక్తిగత ఆస్తి రాజ్యాంగాల పుట్టుక) ఆడా మగా భేదం లేకుండా ప్రజలంతా ఒకానొక వర్గంతో సంబంధం కలిగిన ప్రజలుగానే జీవిస్తారు. వారు ఆ యా ప్రత్యేక సమాజాల ఆర్థిక సంబంధాలకు ప్రతిరూపాలు, పురుషుల వలెనే మహిళలు కూడా పీడితులు, పీడకులుగా విభజింపబడ్డారు. పీడించే వర్గానికి చెందిన స్త్రీలు వారి కుటుంబములో "ఇంటి బానిసలుగా" ఉన్నా వారి వర్గానికి చెందిన పురుషులతో కలసి శ్రామికులను పీడిస్తున్నారు. పీడిత వర్గానికి చెందిన స్త్రీలైతే రెండు రకాల పీడనలకు గురవుతున్నారు. జనాభాలో సగం భాగంగా ఉన్న స్త్రీలలో అధిక శాతం శ్రామిక మహిళలే. ఇటువంటి పనులతోనూ, అటు శ్రమకు తగ్గ ఫలితం అందక ఇంకో పక్క పురుషాధిక్యతకు గురవుతున్నారు. నిజానికి అడు గడుగునా దోపిడీ పీడనలకు గురి అవుతున్నా శ్రామిక మహిళలు విముక్తి కానిదే స్త్రీ విముక్తికి అర్థంలేదు. శ్రామిక స్త్రీలపై మొదటి పీడన వర్గ పీడనే. వ్యక్తిగత యాజమాన్యాన్ని, వర్గ దోపిడిని అంతమొందించే చారిత్రక బాధ్యతను నేరవేర్చేది కార్మిక వర్గం మాత్రమే దాని నాయకత్వాన సాగే సామాజిక విప్లవోద్యమంలో భాగంగానే స్త్రీ విముక్తి సమస్య పరిష్కారమవుతుంది.

పెట్టుబడిదారీ సమాజంలో స్త్రీ ఆర్థికంగా, సామాజికంగా, రాజకీయపరంగా, సాంస్కృతికంగా అణచివేయబడుతున్నది. సామాజిక శ్రమ, ఇంటి పని, పిల్లల పెంపకం, కుటుంబం, లైంగిక సంబంధాలు, మతం, కళలు, సాహిత్యము, సంస్కృతి వంటి అంశాలలో ఈ అణచివేత వ్యక్తమవుతుంది. ఈ వ్యవస్థపై

చెప్పబడిన అంశాలను ఎంత సుస్థిరంగా, ప్రశ్నించడానికి వీలులేకుండా తయారు చేసిందంటే ఎంత ఆలోచనాపరులైన ప్రగతిశీలురైన పురుషులు సైతం పై చెప్ప బడిన అంశాలలో ఏదో ఒక రూపంలో వ్యవస్థ స్త్రీ మీద సాగిస్తున్న ఆధిపత్యాన్ని మౌనంగా ఆమోదిస్తారు. ఈ అంశాలను ఒక్కొక్కటిగా పరిశీలిద్దాం.

స్త్రీలకు ఉత్పత్తిలో భాగస్వామ్యం లేకపోవడమే వాళ్ళ అస్వతంత్రతకు ముఖ్యమైన పునాది. ఈ అస్వతంత్రత పితృస్వామిక సమాజంలో సహజంగానే తండ్రి మీద, అన్నదమ్ముల మీద, భర్త మీద, కొడుకు మీద ఆధారపడవలసిన స్థితికి స్త్రీని నెట్టివేస్తుంది. సోషలిస్టు సమాజ నిర్మాణ లక్ష్యంతో స్త్రీలు ఉత్పత్తి కార్య క్రమాల్లో పాల్గొన్నప్పుడే స్త్రీ శ్రమ వ్యక్తిగత స్థాయి నుంచి సామాజిక స్థాయికి ఎదుగుతుంది. సామాజిక స్థాయి శ్రమకు, వ్యక్తిగత స్థాయి శ్రమకు మధ్య గుణా త్మక భేదముంది. సామాజిక స్థాయి శ్రమ మేధో సృజనాత్మకతకు బుద్ధి వికాసానికి వీలైనన్ని అపూర్వ అవకాశాలను కల్పిస్తుంది. శ్రామికుల చైతన్య స్థాయిని పెంచు తుంది. శ్రామికుల సంఘటిత శక్తిని, సంఘ చైతన్యాన్ని పెంచుతుంది. అయితే సామాజిక శ్రమ మాత్రమే స్త్రీ విముక్తిని సాధిస్తుందా ? అది సాధ్యం కాదు. ఎందు వల్లనంటే స్త్రీని బానిసగా ఉంచి స్త్రీ విముక్తికి అడ్డు తగిలే అనేకానేక కారణాల్లో అదొక ప్రధాన కారణమే తప్ప ఏకైక కారణం కాదు. స్త్రీలు సామాజిక శ్రమలో పాల్గొనడం వల్ల వాళ్ళ పరిధి విశాలమై సామాజిక దృక్పథంతో తమ అణచివేతను చైతన్య పూర్వకంగా ఎదుర్కొగలుగుతారు. అందుకనే స్త్రీల విముక్తికి వాళ్ళ సామాజిక ఉత్పత్తిలో పాల్గొనడం ముందు షరతవుతుంది. సామాజిక ఉత్పత్తిలో పాల్గొన్నప్పుడు సమాన పనికి సమాన వేతనాలు అమలవ్వాలి. అలాగే స్త్రీలు చేసే పనులు పురుషులు చేసే పనులు అనే విభజన లేకుండా అందరూ అన్ని పనులూ చేయాలి.

ఇంటి పని స్త్రీలను ఎంతగా విసిగిస్తుందో లెనిన్ మాటలలో చెప్పాలంటే "స్త్రీ తన కాలాన్ని శక్తినీ కేంద్రీకరించి నిరంతరం అల్పమైన విసుగు పుట్టించే యింటి పనుల్లో సతమతమవుతూవుంటే పురుషుడు ప్రశాంతంగా చూస్తూ ఉంటాడు. ఆ పనిలో స్త్రీ మనోనేత్రం మూసుకుపోతూ ఉంటే, ఆమె బుద్ధి మందగిస్తూ ఉంటే ఆమె హృదయం నీరసిస్తూ ఉంటే ఆమె మానసికశక్తి బలహీనపడుతూ ఉంటే చూస్తూ ఉంటాడు. ఇది సర్వసాధారణమైన విషయం. ఇంతకంటే అతని కఠ్క

తత్వానికి నిదర్శనం ఏం కావాలి?.... స్త్రీ తన గృహ జీవితములో అనంతమైన స్వల్ప విషయాలపై, తన వ్యక్తిత్వాన్ని త్యాగం చేస్తుంది" ('నా స్మృతిపథంలో లెనిన్'-క్లారాజెట్కిన్). ఇటువంటి ఇంటి పనిని సామాజికం చేయకుండా స్త్రీ పురుష సమానత్వం సాధ్యం కాదు. స్త్రీ ఇంటి పనిలో చిక్కుకుని పున్నన్నాళ్ళు ఉత్పత్తిలో స్థానం పొందలేక పోతుంది. అంటే స్త్రీకి ఇంటిపనిలో రెండు నిర్బంధాలను ఏక కాలంలో పాటించాల్సిన పరిస్థితి వస్తుంది. ఇంటి చాకిరీలో మునిగిపోయి అనుత్పాదక శ్రమే జీవిత లక్ష్యంగా చేసుకోవటం ఒకటి. అందువల్లే బయటి సమాజంలోని పుత్పాదక శ్రమలో భాగం పంచుకోలేక పోవటం మరొకటి. ఈ రెండు నిర్బంధాలూ వాటి తార్కిక ఫలితంగా స్త్రీని తక్కువ స్థానంలోకి నెడతాయి.

ఎక్కువ ఉత్పత్తిని సాధించడానికి స్త్రీలను మరింతగా ఉత్పత్తి కార్యక్రమం లోనికి తీసుకురాదలచిన పెట్టుబడిదారీ వ్యవస్థ ఇంటి పనులకై ఎన్నో సాధనాలను, భారీ ఆధునిక యంత్రములను కనిపెట్టింది. కుటుంబాన్ని సాంఘిక యూనిట్‌గా అలాగే ఉంచి, ఇంటి పనిని యాంత్రీకరించడం దుష్ఫలితాలకే దారితీస్తుంది. కానీ ఈ యంత్రాలను ఒక్కొక్క కుటుంబానికి పరిమితం చేయకుండా సామాజికంగా వాడితే వాటివలన తప్పకుండా లాభం ఉంటుంది. అయితే ఇక్కడ స్పష్టంగా గుర్తించాల్సిన విషయాలు రెండున్నాయి. ఒకటి ఇంటిపని సామాజికం అవుతున్నకొద్దీ కుటుంబం అనేది మౌలిక సాంఘిక యూనిట్‌గా క్రమక్రమంగా రద్దు అయిపోతుంది. రెండు ఇంటి పనుల సామాజికీకరణ, యాంత్రీకరణ ఒకే సమయంలో జరగాల్సి ఉంటుంది.

ఇంటి పనులలో ప్రధానమైనదీ, ఎక్కువ సమయాన్ని హరించేదీ వంట పని. ముందుగా దీనిని సామాజికం చేయాల్సి ఉంటుంది. అందుకు సామాజిక వంటశాలలను ఏర్పాటు చేయాల్సి ఉంటుంది. దీంతోపాటు మిగతా ఇంటి పనులను కూడా సాధ్యమైనంతగా సామాజీకరించాలి. అలా సామాజీకరించడం సాధ్యంకాని పనులను ఇంటిలోని సభ్యులు సమానంగా పంచుకోవాలి. ఈ క్రమంద్వారా చిన్న చిన్న ఇంటి పనులుగా అనుత్పాదకమైనవిగా సమాజం ఇంతవరకు పరిగణించిన పనులు ఎంత విలువైనవో, ఎంత అవసరమైనవో నొక్కి చెప్పాల్సి ఉంటుంది. శారీరక శ్రమకూ, మేధో శ్రమకూ మధ్య గండి పూడుస్తున్న క్రమములోనే ఇంటి శ్రమకూ, సామాజిక శ్రమకూ, స్త్రీ శ్రమకూ - పురుషుని శ్రమకూ మధ్య గండి పూడుతుంది.

మాతృత్వాన్ని కేవలం తల్లి బాధ్యతగా కాక, సమాజం బాధ్యతగా చేయటం, అంటే పిల్లల పెంపకాన్ని సామాజికం చేయటం స్త్రీ విముక్తిలో ఓ ముఖ్యమైన అంశం. ప్రస్తుతం పిల్లలకు, తల్లిదండ్రులకూ ముఖ్యంగా పిల్లలకీ, తల్లికి మధ్య ఉన్న సంబంధాలలో తొలగించాల్సినదాన్నంతా తొలగించి వాటిని సమూలంగా మార్చి, పిల్లలు నూతన మానవులుగా తయారయ్యే పరిస్థితి సృష్టించాలి. పిల్లల పెంపకాన్ని సామాజికం చేయడంద్వారా దానిలోని వ్యక్తిగత నిర్బంధ అంశాన్ని రద్దు చేయాలి. పిల్లల్ని పోషించడమేగాక సమాజములో చేయవలసిన పనులు చాలా ఉన్నాయనే అవగాహన స్త్రీలలో పెంపొందించాలి. పిల్లల పెంపకాన్ని ప్రధానంగా శిశు సంరక్షణా కేంద్రాల ద్వారా సామాజికం చేయాలి. ఈ శిశు సంరక్షణా కేంద్రాలూ, పాఠశాలలూ పిల్లలను స్వయం పోషకంగా తమ పనులు, తమ ఆరోగ్యం తామే చూసుకునే విధంగా శిక్షణనివ్వాలి. అపుడు మొదటిగా తల్లి ఎంతగానో విముక్తమవుతుంది.

ఇప్పటివరకూ ఉన్న అన్ని సమాజాలలోనూ కుటుంబం సమాజానికి మౌలిక, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక యూనిట్‌గా ఉంటూ వచ్చినది. సమాజానికి మౌలిక యూనిట్ అయిన కుటుంబం స్థాయి నుంచి ఒక అంతస్థుల వ్యవస్థను ఏర్ప రచకపోతే మొత్తంమీద అంతస్థుల వ్యవస్థ పునాదిగా వున్న సమాజం మనజాలదు. అందుకే కుటుంబంలోని స్త్రీలు, పిల్లలూ, ఇతర సభ్యులూ కుటుంబ పెద్ద ఆదు పాజ్ఞలకు లోబడి ఉండే నిర్బంధపూరితమైన సంబంధాలనే తప్ప కుటుంబంలో స్నేహ సంబంధాలనూ, సమానత్వాన్ని ప్రవేశపెట్టడానికి, రాజకీయ, మత, వంశాధి కారాలు వ్యతిరేకంగా ఉంటాయి. "ఉత్పత్తి సాధనాలు సామాజిక ఆస్తిగా మారడంతో విడి కుటుంబం సమాజానికి ఆర్థిక యూనిట్‌గా వుండడం పోతుంది. సొంత యింటి నిర్వహణ సామాజిక కర్మగా మారుతుంది. పిల్లల చదువు, పెంపకం, సామాజిక ధర్మం అవుతుంది." (ఏంగెల్స్ - కుటుంబం వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగాల పుట్టుక), ఈ విధంగా అది సాంఘిక యూనిట్‌గా వుండడం కూడా పోతుంది. సోషలిస్టు సమా జములో కుటుంబం తన ఆర్థిక, సాంఘిక యూనిట్ బాధ్యతలను క్రమక్రమంగా వదలించుకుంటూ సాంస్కృతిక యూనిట్‌గా కొనసాగుతుంది. అంటే సోషలిస్టు వ్యవస్థ కుటుంబాన్ని కొత్తగా నిర్వచించి కొత్త రూపాన్ని సమకూర్చి కొత్త బాధ్యత కల్పిస్తుంది. ఈ కుటుంబంలోని సభ్యులకు ఎవరికీ మరెవరి మీదా సర్వాధికారాలు

ఉండవు. అందరి మధ్యన స్నేహ, సుహృద్భావాలు వుంటాయి. ఈ సమానత్వం వల్ల సహజమైన ప్రేమానురాగాలు వాటి సరైన అర్థంలో వికసిస్తాయి.

స్త్రీ పురుషుల మధ్య లైంగిక సంబంధాలు తప్పనిసరిగా ఆ యా సమాజాల ఆర్థిక పునాదుల మీదనే ఆధారపడి ఉంటాయి. ఆ యా సమాజాల్లోని ఆర్థిక పునాదికి అనుగుణ్యంగానే స్త్రీ పురుష సంబంధాలు కూడా మారుతూ వస్తున్నాయి. ఏ సమాజంలో శ్రమ విభజన అంతరం ఎక్కువగా ఉంటుందో, ఎక్కడైతే ఎక్కువ మందిలో సృజనాత్మకత ఉండదో ఎక్కడైతే శ్రమను డబ్బుతో తప్ప కొలవలేమో, అక్కడ లైంగిక సంబంధాలు మనిషి బాధలనుంచి తాత్కాలిక వుపశమనం కలిగించే సాధనాలుగా, వినోద అవసరాలుగా అనిపిస్తాయి. అంటే పెట్టుబడిదారీ విధానం, ఒక సహజవాంఛను విశ్రాంతి సాధనంగా మార్చివేసి తద్వారా దాన్నే డబ్బు సంపాదించే సాధనంగా కూడా మార్చివేసింది సమాజం మనుషులమీద పైనుంచి రుద్దుతున్న ఈ సంబంధాలు మానవ సంబంధాలుగా కాక అచ్చంగా మారకపు విలువను కలిగివున్నాయి. మరి అవి సహజంగా ఎపుడు రూపొందుతాయి? ఎపుడైతే స్త్రీ పురుషుల మధ్య శారీరక తేడాలు తప్ప మరే అసమానతలూ వుండవో, ఎపుడైతే మనిషి ఒక శ్రమాజనిత ఉపశమనాన్ని వెతుక్కునే అవసరం ఉండదో, ఎపుడైతే స్త్రీ లైంగిక అణచివేత నుంచి విముక్తి పొందుతుందో అపుడు ఈ అవసరాలలోని సహజత్వం మాత్రమే మిగులుతుంది. "ఇతర విషయాలతోపాటు వివాహము, సెక్సు సంబంధాల్లో కూడా నిజమైన మార్పు శ్రామికవర్గ విప్లవం ద్వారానే వస్తుంది." (లెనిన్)

మొదటి నుండి పాలకవర్గాలు పీడిత ప్రజల దోపిడీ, అణచివేతలకు మతాన్నీ, కళలనూ, సాహిత్యాన్నీ బలమైన సాధనాలుగా వాడుకుంటూ వస్తున్నాయి. స్త్రీలపై పురుషాధిక్యతను శాశ్వతమైనదిగా, అనివార్యమైనదిగా ప్రచారం చేసి చిన్నప్పటి నుండీ స్త్రీల మెదళ్ళలో దాన్ని కూరుకుపోయేటట్లు ఇవి చేస్తాయి. ఈ భావజాలాన్ని ఎదుర్కోడానికి శ్రమను గౌరవించే సంస్కృతినీ, స్త్రీ పురుష సమానత్వాన్ని గౌరవించే, ఎలుగెత్తి చాటే సంస్కృతినీ, భావజాలాన్నీ విస్తృతంగా తీసుకురావాలి. ఈ కృషి ఇప్పటినుండే ప్రారంభమైనా, సోషలిస్టు సమాజంలోనే రాజ్యాధికారాన్ని చేజిక్కించుకున్న కార్మికవర్గం ఈ సంస్కృతిని బలంగా తీసుకురాగలుగుతుంది.

భారతదేశములో మహిళలు పోరాడటమనేది చాలాకాలం నుండి జరుగు తోంది. వలస పాలననూ, భూస్వామ్యాన్నీ వ్యతిరేకిస్తూ జాతీయోద్యమంలో మహిళలు పాల్గొన్నారు. అంతవరకు నాలుగు గోడలమధ్య బందీలుగా ఉంటున్న స్త్రీలు లాఠీలనూ, జైళ్ళనూ, చిత్రహింసలనూ ఎదిరించి ఎన్నో మిలిటెంట్ పోరా టాల్లో పాల్గొన్నారు. జాతీయోద్యమానికి ముందునుంచీ ఉన్న సంస్కరణ ఉద్య మాలు స్త్రీ విద్య కోసం, కన్యాశుల్కం, బాల్యవివాహాలు, సతీసహగమనం వంటి మత దురాచారాలకు వ్యతిరేకంగా ఉద్యమించారు. ఈ పోరాటాల్లో మహిళలు ప్రముఖ పాత్ర వహించారు. అటు సంస్కరణోద్యమాలకు గానీ, ఇటు జాతీయోద్యమాలకు గానీ స్పష్టమైన సైద్ధాంతిక, రాజకీయ పునాది లేనందున అవి మహిళల సమస్యకు సరైన పరిష్కార మార్గాన్ని చూపలేకపోయాయి.

భారతదేశంలో 1920లో కమ్యూనిస్టు పార్టీ ఏర్పడిన నాటినుండి సరైన పంథాను నిర్దేశించ లేకపోయింది. ఏ పంథాద్వారా విప్లవం విజయవంతం అవుతుంది అనే విషయంలో ఆనాటి పార్టీకి సరైన సైద్ధాంతిక అవగాహన లేదు. తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటంలో స్త్రీలు ప్రముఖపాత్ర వహించారు. 1946-51 మధ్య జరిగిన ప్రజల సాయుధ పోరాటంలో, అంతకుముందు జరిగిన 1941-46 ప్రజా పోరాటాల్లోనూ స్త్రీలు పాల్గొన్నారు. ముందు భూమి కోసం, కూలీరేట్ల పెంపుదల కోసం భూస్వాములు తమపై అమలు జరుపుతున్న అత్యాచారాలకు వ్యతిరేకంగా మహిళలు కదిలినప్పటికీ తర్వాత సామాజిక మార్పుకోసం పోరాడే శక్తిగా, సామాజిక శక్తిగా సాయుధ పోరాటంలో ఆయుధాలు పట్టి ముందుకు కదిలారు. కమ్యూనిస్టు పార్టీ మహిళాసంఘాలను నిర్మించింది. 'ఆంధ్రవనిత' పేరుతో ప్రత్యేక మహిళా పత్రికను నడిపింది. పోరాటాన్ని అణచడంలో భాగంగా మహిళాసంఘంపై, పత్రికపై కూడా నిషేధం విధించబడినది. ఎంతో వీరోచితంగా నిర్బంధాన్ని ధిక్క రించి ముందుకొచ్చిన తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం వెనుకడుగు వేయ టానికి ప్రధాన కారణం ఆనాటి కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం అనుసరించిన తప్పుడు పంథానే భారతదేశ వ్యాపితంగా చెలరేగిన వర్లీ, తెభాగ, పున్నప్ర, వాయ లార్ వంటి అనేక రైతాంగ పోరాటాల్లో కూడా మహిళలు ప్రముఖపాత్ర వహించారు. ఆ స్త్రీలు చేసిన పోరాటాలు భారతదేశంలో విప్లవిస్తున్న మహిళలకు ఒక పుత్తేజం, ఒక గుణపాఠం కూడా. గుణపాఠం ఎందుకంటే భారతదేశంలో కమ్యూ

విస్టు పార్టీ భారత పీడిత ప్రజల విముక్తి మార్గాన్ని చూపలేకపోయింది. అందువల్లే అందులో అంతర్భాగమైన మహిళల విముక్తి మార్గాన్ని కూడా చూపలేకపోయింది.

1967లో నక్సల్బరీ పోరాటం బద్దలైంది. అది భారతదేశ విముక్తి మార్గాన్ని చూపింది. భారతదేశం అర్ధ వలస, అర్ధ భూస్వామ్య దేశమనీ, దీర్ఘకాలిక సాయుధ పోరాటం ద్వారా మాత్రమే విప్లవం విజయవంతమవుతుందనీ నూతన ప్రజాస్వామిక విప్లవ లక్ష్యాన్ని భారత పీడిత ప్రజానీకానికి నిర్దేశించింది. నక్సల్బరీ పోరాటం పీడిత ప్రజల విముక్తి మార్గాన్ని నిర్దేశించటం ద్వారా పీడిత ప్రజల్లో సగభాగమైన మహిళా విముక్తికి కూడా మార్గాన్ని చూపింది. నక్సల్బరీ పోరాట ఉత్తేజంతో శ్రీకాకుళం, దేబ్రా, గోపీ వల్లభపూర్, లఖింపూర్, ఖేరీ, భీర్భూం మొదలైన ఎన్నోచోట్ల దేశవ్యాప్తంగా సాయుధ రైతాంగ పోరాటాలు చెలరేగాయి. ఆంధ్రలోని శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరాటంలో స్త్రీలు పురుషులతోపాటు సమానంగా పాల్గొంటూనే భూమికోసం, అధిక వడ్డీరేట్లకు వ్యతిరేకంగా ఫారెస్టు అధికారుల జులుంకు వ్యతిరేకంగా పోరాటం చేయడమే కాకుండా సారా, లైంగిక అత్యాచారాలు వంటి వాటికి వ్యతిరేకంగా కూడా మిలిటెంట్‌గా పోరాడారు.

ఇక్కడ మనం ఒక విషయాన్ని గమనించాలి స్త్రీలు ఉద్యమాలలో, వర్గ పోరాటాలలో పాల్గొంటున్నారంటేనే దాని అర్థం. వారు పితృస్వామ్యాన్ని ఎదిరించి ఆ మేరకు దాన్ని ధ్వంసం చేశారనే. వర్గ పోరాటాల్లో పాల్గొంటున్న స్త్రీలు తమపై జరుగుతున్న అనేకరకాల అణచివేతలను గుర్తించడమే గాక వాటి మూలకారణాలను నిర్మూలించడానికి చైతన్యవంతంగా కృషి చేస్తారు. ఆ విధ గా వారు పితృస్వామ్యాన్నీ, దానికి పునాదిగావున్న స్వంత ఆస్తి వ్యవస్థనూ ధ్వంసం చేయగలుగుతారు.

నక్సల్బరీ - శ్రీకాకుళ పోరాటాలు స్తబ్దతకు గురైన తర్వాత గత రెండు దశాబ్దాలలోనూ ముఖ్యంగా ఆంధ్రలోని తెలంగాణా ప్రాంత రైతాంగం ఉవ్వెత్తున ఉద్యమించారు. ఆ ఉద్యమములో గ్రామీణ రైతాంగ స్త్రీలు పెద్ద ఎత్తున పాలుపంచుకున్నారు. భూస్వామ్య వ్యతిరేక ఆర్థిక, సాక్షిక పోరాటాలేగాక, సాంఘిక అరాచకాలకూ, అణచివేతలకు కూడా వ్యతిరేకంగా వారు పోరాడారు. ఈ పోరాటాలు తెలంగాణా గ్రామీణ స్త్రీలకు సామాజిక విముక్తిలోనే స్త్రీ విముక్తి ముడిపడి ఉంది అనే

స్పృహను కలిగించాయి. ఆ కారణముగా అనేకమంది రైతాంగ మహిళలు విప్లవంలో పూర్తికాలం పని చేసేవారుగా తయారై, తమ్ము తాము విప్లవానికి అంకితం చేసుకున్నారు.

మరో ప్రక్కన ఇదే కాలంలో పట్టణ ప్రాంతాలలో విద్యార్థి, యువజన, కార్మిక రంగాల్లో కూడా పోరాటాలు ఉధృతులు కాగా, ఆ పోరాటాల్లోనూ పెద్ద ఎత్తున మహిళలు పాల్గొనటం ప్రారంభించారు. పై పోరాటాల ప్రభావం కారణంగానే తర్వాత కాలంలో పట్టణాల్లో మహిళా ఉద్యమ నిర్మాణం ప్రారంభము అయింది. సాంఘిక దురాచారాలకూ, మహిళలపై అత్యాచారాలకు, వరకట్న దురాచారానికి, స్త్రీలపై రాజ్యహింసకు వ్యతిరేకంగానూ కొన్ని పోరాటాలు నిర్వహించబడ్డాయి. తద్వారా పట్టణ మధ్యతరగతి కార్మిక స్త్రీలపై మంచి ప్రభావాన్ని ఆ ఉద్యమాలు కలిగించాయని చెప్పవచ్చు.

అంతేగాక విప్లవోద్యమ ప్రభావంతోనే ఆంధ్ర రాష్ట్రములో సాహిత్య-సాంస్కృతిక రంగాల్లో కూడా క్రమంగా స్త్రీల పాత్ర పెరుగుతున్నది.

1980 తర్వాత దండకారణ్య గిరిజన రైతాంగం చేపట్టిన పోరాటాల్లో వేలాదిగా ఆదివాసీ మహిళలు పాల్గొనటం ప్రారంభించారు. ఆదివాసీ మహిళలు ముఖ్యంగా మహారాష్ట్ర ప్రాంతంలో ఆదివాసీ మహిళా సంఘాల నిర్మాణాన్ని ప్రారంభించారు. తమ తెగ సాంప్రదాయాలకూ, అనాచారాలకు వ్యతిరేకంగా పోరాడటమేకాక, ప్రజాస్వామిక చైతన్యాన్ని అలవర్చుకుంటూ రాజ్యానికి, దాని అణచివేతకు కూడా వ్యతిరేకంగా ఆదివాసీ మహిళ ఈనాడు పోరాడుతోంది.

గత రెండు దశాబ్దాల విప్లవోద్యమ ప్రభావమే, అది కల్పించిన ప్రజాస్వామిక స్పృహే ఆంధ్ర రాష్ట్రంలో ఈనాడు లక్షలాది మహిళలు చేపట్టిన సారా నిషేధ ఉద్యమం.

పోరాడే మహిళలపై అటు ఆదివాసీ ప్రాంతాల్లో కానీ, మైదాన, పట్టణ ప్రాంతాల్లో గానీ రాజ్యం తన ఫాసిస్టు నిర్బంధకాండను అమలు చేస్తోంది. పోలీసులు మహిళల్ని వివస్త్రల్ని చేసి ఊరేగించడం, సామూహిక మానభంగాలకు గురి చెయ్యటం, ఎన్‌కౌంటర్ల పేరిట కాల్చి చంపటం, అరెస్టులూ, చిత్రహింసలూ, అసభ్యకరమైన తిట్లతో స్త్రీలను వేధించటం జరుగుతోంది.

గత రెండు దశాబ్దాలుగానూ ఆంధ్రా, దండకారణ్యాలలో జరుగుతున్న ప్రజాస్వామిక విప్లవం మహిళల్ని పెద్దసంఖ్యలో కదిలించి సామాజిక విముక్తిలో భాగంగా, వారిపైన ప్రత్యేక సమస్యల కోసం కూడా ఉద్యమాలు నిర్మించింది. తద్వారా వారిని తనలో ఇముడ్చుకోగలిగింది. మహిళా సంఘాల నాయకులుగా, గెరిల్లాలుగా, పురుషులతోపాటు సమాన స్థాయిలో మహిళలు ఈనాడు పోరాడుతున్నారు.

ప్రజాస్వామిక విప్లవం మహిళల్ని వేలసంఖ్యలో తనచుట్టూ సమీకరించుకున్నా, వందల సంఖ్యలో వారిని అనేక రంగాల్లో తనలో ఇముడ్చుకున్నా మహిళా రంగాన్ని ప్రత్యేకించి చేయాల్సినంతగా అభివృద్ధి చెయ్యటంలో లోపం వుందని చెప్పక తప్పదు.

భారతదేశములో గానీ, మరెక్కడైనా గానీ విప్లవోద్యమం ఒడిదుడుకులతోనే మహిళా ఉద్యమాన్ని కూడా చూడాలి. విప్లవోద్యమపు ప్రతి అడుగూ మహిళా ఉద్యమాన్ని ఒక అడుగు ముందుకు నడిపించింది. నడిపిస్తుంది. విప్లవోద్యమానికి, మహిళా ఉద్యమానికీ ఉండవలసిన ఉండదగిన ఈ గతితార్కిక అన్యోన్య సంబంధాన్నే గుర్తించవలసి వుంది.

గత రెండు దశాబ్దాలుగా భారతదేశంలో జరుగుతున్న ఉద్యమాలను పరిశీలిస్తే స్త్రీలు లేని ఏ ఉద్యమమూ, వర్గ పోరాటమూ కన్పించదు. భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలోనూ, తమపై జరుగుతున్న అణచివేతలకు వ్యతిరేకంగానూ స్త్రీలు సంఘటిత పడుతున్నారు. దేశంలో గల అన్ని మతాలూ స్త్రీలను అణచిపెట్టాలనే పురుషాధిక్య భావజాలాన్నే ప్రచారం చేస్తూ అమలు జరుపుతున్నాయి. ప్రత్యేకించి ఈ రోజు హిందూ మతోన్మాద పాలకవర్గాలూ, సంస్థలు, హిందుత్వం పేరుతో ఇల్లు చక్కదిద్దుకోవడంలో, భర్తను దైవసమానంగా చూసుకోవడంలో పుణ్యమూ, పరమార్థమూ వున్నాయని ప్రచారం చేస్తూ పాత సాంప్రదాయ చట్రంలో స్త్రీలను ఇమిడ్చి భూస్వామ్య వ్యవస్థను నిలబెట్టడానికి ప్రజా పోరాటాలను అణచడంలో భాగంగా ఒక ఫాసిస్టు శక్తిగా ముందుకు వస్తూ స్త్రీలనుకూడా అందుకు ఒక సాధనంగా తీసుకువస్తున్నాయి. ఈ మత ఛాందసత్వాన్ని ప్రతిఘటిస్తూ మహి

కలు సంఘటిత పడుతున్నారు. తమ సమస్యల పరిష్కారం సైతం భూమితోనే ముడిపడి ఉందని గ్రహించిన గ్రామీణ గిరిజన స్త్రీలు రైతాంగ పోరాటాల్లో పాల్గొవ దం గణనీయంగా పెరిగింది. తమ జాతుల స్వయం నిర్ణయాధికార హక్కుల కోసం జరుగుతున్న జాతి విముక్తి పోరాటాల్లో మహిళలు పోరాడుతున్నారు. ప్రభుత్వ కార్మిక వ్యతిరేక విధానాలను ఎదిరిస్తూ, అక్రమ లాకౌట్లకూ, అధిక ధర లకూ, వేతనాల్లో అసమానత్వానికీ, సామ్రాజ్యవాద అనుకూల ఆర్థిక విధానాలకూ వ్యతిరేకంగా కార్మిక స్త్రీలు పోరాడుతున్నారు. ఇలా ఉద్యమిస్తున్న స్త్రీలపై ప్రభు త్వము పాశవికమైన నిర్బంధకాండను ప్రయోగిస్తోంది. ఈ ఉద్యమాలను అణచ దంలో భాగంగా లైంగిక అత్యాచారాలను కూడా ఒక సాధనంగా ఉపయోగిస్తోంది. అయినా వీటిని లెక్కచేయకుండా మహిళలు పోరాటాలలో మరింతగా పాల్గొంటు న్నారు. ఈ పోరాటాలు కొన్ని కార్మిక వర్గ నాయకత్వంలో, మరికొన్ని కార్మిక వర్గేతర నాయకత్వంలో జరుగుతున్నాయి. అయితే ఈ పోరాటాలన్నీ కార్మికవర్గ నాయకత్వాన జరిగే నూతన ప్రజాస్వామిక విప్లవంలో భాగమయినపుడే తమ లక్ష్యాన్ని చేరుకోగలవు.

అర్ధ వలస, అర్ధ భూస్వామ్య దేశమైన భారతదేశంలో నూతన ప్రజాస్వా మిక విప్లవం లక్ష్యంగా గల మహిళా ఉద్యమాన్ని నిర్మించవలసిన అవసరం ఎంతైనా ఉంది. కార్మికవర్గ నాయకత్వములో స్త్రీలు పురుషులతోపాటు సామ్రాజ్య వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక పోరాటంలో పాల్గొంటూనే తమ ప్రత్యేక సమ స్యల కోసం కూడా పోరాడాలి. అయితే నూతన ప్రజాస్వామిక విప్లవములోనే మహిళా విముక్తి సంపూర్ణముగా సాధించబడదు. సమాజం సోషలిజం గుండా కమ్యూనిజంలోకి పయనించే దశలోనే క్రమక్రమంగా స్త్రీ విముక్తి సాధించబడు తుంది. అయితే సోషలిజంలో కూడా ఆర్థిక పునాది మారిన వెంటనే ఉపరితల అంశాలు అంత త్వరగా మారవు. తరతరాలుగా జీర్ణించుకుపోయిన పురుషాధిక్య భావజాలం వెంటనే మారిపోదు. దీనికి నిరంతర పోరాటం, ఎడ్యుకేషన్ అవసరం. కళలు, సాహిత్యం ద్వారా, ప్రచారం ద్వారా అంటే మావో చెప్పిన సాంస్కృతిక విప్లవం ద్వారానే అది సాధ్యపడుతుంది. దీనిని ఇప్పటినుంచే నిరంతరం కొనసా

# భారతదేశంలో మహిళా ఉద్యమంలో ధోరణులు- విమర్శనాత్మక అంచనా

సమకాలీన భారతదేశంలో జరుగుతున్న ప్రజాస్వామిక ఉద్యమంలో, మహిళా ఉద్యమం ఒక ముఖ్యమైన భాగం. గత దశాబ్ది, అంతకంటే ముందునుండి కూడా మహిళలు దండకారణ్య, బీహారులలోని విప్లవ రైతాంగ పోరాటాలు, కాశ్మీర్, ఈశాన్య భారతంలోని జాతి ఉద్యమాల నుండి ఆంధ్రప్రదేశ్‌లో సారావ్యతిరేక ఉద్యమం వరకు వివిధ రాజకీయ సాంఘిక ఉద్యమాలలో పెద్ద ఎత్తున పాల్గొన్నారు. భారత సమాజంలో సాంఘిక వైరుధ్యాలు పదునెక్కడాన్ని ఇది సూచిస్తోంది. మహిళా ఉద్యమం అభివృద్ధి చెందటానికి భౌతిక పరిస్థితి పరిపక్వంగానున్నది. అయితే అదే సమయంలో మహిళా ఉద్యమంలో ప్రధాన ధోరణి అయిన స్వయం ప్రతిపత్తి గల మహిళా ఉద్యమం స్తబ్దత నెదుర్కొంటోంది. ఆ ధోరణికి చెందిన ముఖ్యులు ఈ సమస్యను గుర్తించారు.

మహిళలపై అభివృద్ధి నిరోధక, మత దురహంకార శక్తుల ప్రభావం వాళ్ళని బెంబేలెత్తించింది. ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్ళటానికి అవసరమయిన, సరైన వ్యూహం తమకు లేదని కూడా వారు నమ్ముతున్నారు. నేడు మహిళా ఉద్యమంలో ప్రధాన ధోరణిని పట్టి పీడిస్తున్న సైద్ధాంతిక, రాజకీయ సంక్షోభమిదే.

---

గించవలసిన అవసరం ఉంది. ఒక మనిషిని మరొక మనిషి దోచుకోని, వర్గాలు లేని కమ్యూనిస్టు సమాజంలోనే పీడిత ప్రజల, స్త్రీల సంపూర్ణ విముక్తి సాధించబడుతుంది.

* నూతన ప్రజాస్వామిక విప్లవం లక్ష్యంగా గల మహిళా ఉద్యమాన్ని నిర్మిద్దాం !
* సామ్రాజ్యవాద, భూస్వామ్య సంస్కృతిని నిర్మూలిద్దాం !
* మత ఛాందసత్వానికి వ్యతిరేకంగా పోరాడుదాం !
* భూస్వామ్య, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాల్లో పాల్గొంటున్న స్త్రీలపై ప్రభుత్వ నిర్బంధాన్ని ఖండిద్దాం !

—మహిళా మార్గం



మహిళా ఉద్యమంలోని వివిధ రాజకీయ ధోరణులను విశ్లేషించటం, ప్రధాన ధోరణిలోని సంక్షోభానికి మూలాన్ని తెలుసుకోవడం ఈ పత్రం ఉద్దేశం.

యూరప్, అమెరికాలలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి తత్ఫలితంగా కుటుంబ వ్యవస్థలో వస్తున్న మార్పులు, సమాన హక్కుల కోసం సాగిన మహిళా ఉద్యమం ఆవిర్భవించడానికి అవసరమయిన భౌతిక పరిస్థితులను సృష్టించటమే కాక, వైరుధ్యాలను తీవ్రతరం చేసింది. ప్రతి దేశానికి బలమైనదో, బలహీనమైనదో మహిళా తిరుగుబాట్లు, నిరసనల సాంప్రదాయమొకటున్నది. కానీ స్త్రీలు తమ విముక్తి కోసం తామే నిర్వహిస్తున్న స్త్రీల ఉద్యమం పెట్టుబడిదారీ విధానం పెరిగిం తరవాతనే ఆవిర్భవించింది. మహిళా ఉద్యమాలు విస్తృతమైన ఆర్థిక, రాజకీయ పోరాటాలలో అంతర్భాగంగా వుంటాయని, సన్నిహితంగా ముడిపడి వుంటాయని అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలోనూ, మూడో ప్రపంచ దేశాలలోనూ గత రెండు దశాబ్దాలుగా సాగిన మహిళా ఉద్యమ చరిత్ర నిరూపిస్తోంది. 19 వ శతాబ్దం చివరిలోను, 20వ శతాబ్దం ప్రారంభంలోనూ రాజకీయ, కార్మిక సంఘాల హక్కుల కోసం సాగిన మహిళా పోరాటాలు సోషలిస్టు, ట్రేడ్ యూనియన్ ఉద్యమాలతో పాటే విస్తృతమైన సామ్రాజ్యవాద వ్యతిరేక వెల్లువలో భాగంగా కొనసాగాయి. ఈ మహిళా పోరాటాలు సమాజం మీద తమ ముద్ర వేశాయి. స్త్రీలకు చట్టపరమైన హక్కులు సాధించాయి. తిరిగి 1960ల చివరిలో మహిళా ఉద్యమం ప్రపంచ వ్యాప్త సామ్రాజ్య వ్యతిరేక వెల్లువనుండి, వియత్నాం యుద్ధం నుండి, ఆ శకం లోని విద్యార్థి యువజన తిరుగుబాట్లలో నుండి తలెత్తింది. సాధారణమైన సామా జిక వైరుధ్యాలు స్త్రీల అణచివేతకు సంబంధించిన, నిర్దిష్టమైన వైరుధ్యాలు ఒక దానితో ఒకటి పెనవేసుకుపోయాయి. అందుచేత స్త్రీ విముక్తి పోరాటం, సామ్రాజ్య వాదానికి దానిని బలపరిచే నిర్మాణాలకు వ్యతిరేకంగా సాగే, విస్తృతమైన పోరాటా లలో అంతర్భాగం.

భారతదేశంలో కూడా మహిళా విముక్తి భారత సమాజంలో రావల్సిన విప్ల వాత్మక పరివర్తనతో ముడిపడి వుంది. మన సమాజంలో స్త్రీలకు, కనీసం ప్రాథ మికమైన ప్రజాస్వామిక హక్కులు కూడా లేవు. స్త్రీల మీద అమలవుతున్న పితృ స్వామిక అణచివేత, దోపిడి, ఆర్థిక పరాధీనత, లొంగుబాటుతనం, యివన్నీ

మన దేశంలో ప్రధానంగా వున్న అర్ధ భూస్వామ్య సంబంధాలతో ముడిపడి వున్నాయి. ఆ అర్ధ భూస్వామ్య సంస్కృతే మన ఆర్థిక వ్యవస్థ యొక్క ఉత్పాదక పెరుగుదలను అరికడుతూ, మన సామాజిక జీవితంలోకి వినిమయ సంస్కృతిని, లైంగిక సంస్కృతిని చొప్పించాయి. భారతదేశంలో పాలక వర్గాలయిన దళారీ బూర్జువా వర్గం, భూస్వామ్య శక్తులు పితృస్వామ్యాన్ని, కులం పునాదిగా గల సాంఘిక సంబంధాలను భూస్వామిక భావజాలాన్ని సమర్థిస్తూ రక్షిస్తున్నాయి. ఇవి లేకుండా వారు ఆర్థిక వ్యవస్థ మీద తమ పట్టును కాపాడుకోలేరు. ఈ వ్యవస్థను యథాతథంగా వుంచడానికి వారనుసరిస్తున్న భావజాల ప్రచారం, అణచివేత అనే ద్విముఖ వ్యూహాన్ని అమలు చేయడంలో రాజ్యాంగ యంత్రం ప్రధాన సాధనంగా వుపయోగపడుతోంది. అందుచేత అసంఖ్యాకమైన స్త్రీలకు ముందు ప్రజాస్వామిక హక్కులను సాధించగలగడం స్త్రీ విముక్తికి వ్యూహం కావాలి. అందుకోసం ఆ ఉద్యమం పాలక వర్గాలకు, వారి రాజ్యానికి వ్యతిరేకంగా ఎక్కుపెట్టబడాలి.

భారతదేశంలోని మార్క్సిస్టు-లెనినిస్టులు నిజమైన ప్రజాస్వామిక సమాజాన్ని స్థాపించాలనే ఉద్దేశంతో పాలక వర్గాలకు రాజ్య యంత్రాంగానికి వ్యతిరేకంగా పోరాడారు. కానీ వారు స్త్రీ విముక్తి కర్తవ్యాన్ని ఒక సమగ్రమైన పద్ధతిలో చేపట్టలేదు. ఆ సమస్య మీద ఒక నిర్దిష్టమైన దృక్పథాన్ని రూపొందించుకోలేదు. ఇది మార్క్సిస్టు-లెనినిస్టు గ్రూపులలోని స్త్రీల అసంతృప్తిలో ప్రతిబింబించింది. ఆ అసంతృప్తి ఫలితంగానే ఆలస్యంగానైనా చైతన్యపూరితంగా ఆ కర్తవ్యాన్ని చేపట్టే ప్రయత్నం ప్రారంభమయింది. భారతదేశంలో మహిళా ఉద్యమ చరిత్రను సమకాలీన మహిళా ఉద్యమంలోని భిన్న ధోరణులను, క్లుప్తంగా విశ్లేషించుకుందాం.

## 1947కి ముందు మహిళా ఉద్యమం :

స్వాతంత్ర్య పోరాటం, ట్రేడ్ యూనియన్ ఉద్యమాలు, కుల వ్యతిరేక పోరాటాల వంటి, రాజకీయ, సామాజిక కార్యకలాపాల్లో, మహిళలు పెద్ద సంఖ్యలో పాల్గొనడం 1920ల నుండే ప్రారంభమయింది. అయితే వివిధ రకాల అణచివేతల నుండి స్త్రీలను విముక్తి చెయ్యాలనే లక్ష్యంతో సాగిన పోరాటం ఒక దశాబ్దం క్రితం నుండి మాత్రమే ప్రారంభమయింది. దేశంలోని వివిధ ప్రాంతాలలో తల ఎత్తిన

ప్రాంఘిక సంస్కరణ ఉద్యమాలకు బ్రిటీష్ వలస పాలన, ఫ్రెంచి విప్లవ భావాలు, మెల్లి మెల్లిగా పెట్టుబడిదారీ విధానం చొరబారటం ఒక కొత్త విద్యాధిక పాలనా యంత్రాంగపు, వాణిజ్యవర్గం తల ఎత్తటం అవసరమయిన పునాదిని సమకూర్చాయి. 19 శతాబ్దం చివర నాటికి ఈ ఉద్యమాలు బహుముఖంగా విస్తరించాయి. వాటి నుండి అనేక ధోరణులు తల ఎత్తడాన్ని మనం గమనించవచ్చు.

1947కు ముందునాటి మహిళా ఉద్యమంలోని ధోరణులను స్థూలంగా ఇలా వర్గీకరించవచ్చును. a) తొలినాటి సంఘ సంస్కరణా ఉద్యమంలోని ఉదారవాద ప్రజాస్వామిక ధోరణి. b) తరువాత కాలం నాటి సంఘ సంస్కరణోద్యమంలోని హిందూ పునరుద్ధరణ వాద ధోరణి. c) కుల వ్యతిరేక వుద్యమంలోని సోషల్ - ఫెమినిస్టు ధోరణి. d) కమ్యూనిస్టు ధోరణి.

19వ శతాబ్దం నాటి తొలి సంఘ సంస్కరణోద్యమం చట్టపరమైన, సామాజికమైన పద్ధతుల ద్వారా స్త్రీల అభ్యున్నతి కోసం సాగిన వుద్యమం. అయితే అది పురుషుల నాయకత్వంలో జరగడమే విచిత్రం. దీనికి ఒకే ఒక మినహాయింపు పండిత రమాబాయి. ఆ కాలంలో కుటుంబ మద్దతు లేకుండా పని చేసిన ఒకే ఒక స్త్రీ ఆమె. మహిళలను విద్యావంతులను చేయడానికి మాత్రమే కాక, అనాథ వితంతు స్త్రీలకు శరణాలయాలు స్థాపించటానికి కూడా ఆమె ఎంతో కృషి చేశారు బెంగాలుకు చెందిన రాజారామ్‌మోహన్‌రాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, మహారాష్ట్రకు చెందిన అగర్కార్, రనడే, ఆంధ్రకు చెందిన వీరేశలింగం వంటి తొలి సంఘ సంస్కర్తలకు స్త్రీల పట్ల ఉదారవాద దృష్టి వుండేది. వారు 'సతి'కి వ్యతిరేకంగా, బాల్య వివాహాలకు వ్యతిరేకంగా, వితంతు వివాహాలకు, వివాహ వయస్సు పెంపుదలకు స్త్రీ విద్యకు అనుకూలంగా ప్రచారం చేశారు. అయితే ఈ సంస్కర్తలందరూ బ్రాహ్మణులే. వారి 'ఉద్ధరణ' ప్రధానంగా అగ్రకులాల స్త్రీలను దృష్టిలో పెట్టుకుని చేసిందే. ఈ సంస్కర్తలు సామూహిక సంతకాల సేకరణ, బహిరంగ సభలు, చట్టపరమైన సంస్కరణల కోసం, బ్రిటీష్ ప్రభుత్వంతో బేరసారాలాడటం వంటి సాత్విక పద్ధతులనుసరించారు. 1829లో 'సతి' నిషేధ చట్టం, 1865లో వితంతు పునర్వివాహ చట్టం 1891లో వివాదాస్పదమైన వివాహ సమ్మతి వయస్సు చట్టం మొదలైన అభ్యుదయకరమైన చట్టాలను చేయించటంలో ఈ సంస్కర్తలు విజయాన్ని సాధించారు.

సనాతన బ్రాహ్మణులు ఈ సంస్కరణలను అడుగడుగున వ్యతిరేకించారు. సంఘ బహిష్కారం మొదలుకొని హింసాత్మక బెదిరింపుల వరకు ఎన్నో సాంఘిక అవమానాలను ఉదారవాద సంస్కర్తలు భరించవలసి వచ్చింది. 19వ శతాబ్దం చివరి రెండు దశాబ్దాలలో మహారాష్ట్రలోని సంస్కర్తల మీద బాలగంగాధర్ తిలక్ ద్విముఖ దాడి చేశారు. సంస్కర్తలు మత వ్యతిరేకులని, జాతి వ్యతిరేకులని, తమ సమాజాన్ని, మతాన్ని మార్చటానికి ఆత్మాభిమానం గల ఏ భారతీయుడు విదేశీ పాలకుల సహాయం తీసుకోడని తిలక్ విమర్శించాడు. జాతీయతా వాదాన్ని, హిందూ పునరుద్ధరణ వాదంతో సమానం చేసి చూపే ఒక కొత్త ధోరణి ఈ ఘర్షణ ఫలితంగా సంఘ సంస్కరణ ఉద్యమంలో తలెత్తింది. దీన్ని ప్రోత్సహించింది బ్రాహ్మణ శిష్ట వర్గం. తొలినాటి ఉదారవాద సంస్కర్తలు అగ్రకులాలకు, అగ్ర వర్గాలకు చెందిన వారు కావడం చేత హిందూ భావజాలంలోని కుల, పితృస్వామిక ధోరణులను ఎదుర్కోవడానికి సిద్ధపడలేదు ఫలితంగా వీరిని పునరుద్ధరణ వాద గ్రహణం మింగి వేసింది.

నూతన పునరుద్ధరణ వాదులు దయానంద సరస్వతి స్థాపించిన ఆర్యసమాజ్ (1875), వివేకానందుడు రామకృష్ణా మిషన్ (1897), కొంత వరకు అనిబిసెంట్ స్థాపించిన హిందు అసోసియేషన్ (1904) వంటి శక్తివంతమయిన సంస్థలలో తమను తాము వ్యక్తీకరించుకున్నారు. వీరు హిందూ సంస్కర్తల మీద దాడి చేస్తూనే వారి సంస్కరణల్లో కొన్నిటిని మినహాయింపులతో బలపరిచారు. ఉ॥దా పునరుద్ధరణ వాదులు బాల వితంతువుల పునర్వివాహాన్ని ప్రోత్సహించారు గాని, వితంతు యువతుల పునర్వివాహాన్ని సమర్థించలేదు. స్త్రీ విద్యను ప్రోత్సహించారుగాని, అది స్త్రీలను మంచి గృహిణులుగా తీర్చిదిద్దేదిగా వుండాలని అభిప్రాయపడ్డారు.

సాంఘిక సంస్కరణ ఉద్యమంలో అంతర్లీనంగా వున్న ఉదారవాద ఫెమినిష్టు ధోరణి పూర్తిగా అంతరించి పోలేదు 1927లో స్థాపించబడ్డ అఖిల భారత మహిళా సభ ద్వారా ఆ ధోరణి వ్యక్తీకరించబడింది. దానికి ముందున్న బ్రాహ్మిక సమాజ్, ఆర్యనారీ సమాజ్ వంటి అనేక చిన్న చిన్న ప్రాంతీయ సంస్థల కంటే, ఇది పూర్తిగా భిన్నమైనది ఈ సంస్థను నడపటానికి స్త్రీలు తమంతట తామే ముందుకు వచ్చారు. మహిళా నాయకత్వం పట్ల, దానికి చిత్తశుద్ధితో కూడిన దృక్పథమున్నది. మహిళల హక్కుల పట్ల ఆ సంస్థ రాడికల్ వైఖరిని కలిగి

వున్నది. హిందూ 'పర్సనల్ లా'ను సంపూర్ణంగా సంస్కరించాలన్న డిమాండ్ ఈ ధోరణి ఫలితంగా తలెత్తింది. 1943, 44 మధ్య కాలంలో హిందూ కోడ్ బిల్లు కోసం సాగిన ప్రచారంలో గాంధీ యిచ్చిన సలహాను కూడా కాదని, ఈ మహిళా సంస్థ చురుకైన పాత్ర నిర్వహించింది. ఈ విషయమై ప్రభుత్వం నియమించిన కమిటీని భారత జాతీయ కాంగ్రెస్ బహిష్కరించినప్పటికీ మహిళా సంస్థ సభ్యులు సాక్ష్యం చెప్పారు కానీ హిందూ కోడ్ బిల్లుకు సనాతన హిందువుల సామూహిక వ్యతిరేకతను ఎదుర్కోవాల్సి రావడంలో ఈ సంస్థ యొక్క వున్నత వర్గ, అగ్ర కుల ఉదారవాద ఫెమినిస్టు బలహీనత బయటపడింది. ఈ సంస్థ రాజకీయాలు ఎప్పుడూ హాలు మీటింగులకు, తీర్మానాలు చేయటానికి మాత్రమే పరిమితమై వుండేది. అల్ప సంఖ్యాక వర్గాల స్త్రీలను గాని, కింది కులాల స్త్రీలను గాని కలుసుకోవడానికి, ప్రజా సమీకరణకు వీరెప్పుడూ చిత్తశుద్ధితో ప్రయత్నించలేదు.

పునరుద్ధరణ వాదుల వారసత్వాన్ని స్వీకరించిన గాంధీ మరింత జిత్తులమారి తనంతో వ్యవహరించాడు. ఆయన ఆదర్శ భారతదేశాన్ని రామరాజ్యంగానూ, భారత స్త్రీకి ఆదర్శంగా సీతను ప్రతిపాదించాడు. భార్య భర్తకు మితి మీరి లోబడి వుండటాన్ని విరసించాడు. కానీ హిందూ సమాజంలోని సాంప్రదాయక కుటుంబ వ్యవస్థా నిర్మాణాన్ని ఆయన ఛాలెంజ్ చెయ్యలేదు. మగవారు బహిరంగ నిరసన చర్యలను చేపట్టాలని రాజకీయ నిర్మాణంలో పాల్గొనాలని, జాతీయోద్యమ ప్రారంభంలో చెప్పిన గాంధీ మహిళలను ఇంటి వద్దనే వుండి నూలు వడకడాన్ని ప్రోత్సహించాడు. స్త్రీలు వీధుల్లోకి రావడానికి అనుమతించడానికి గాంధీ మొదట్లో ఇష్టపడే వాడు కాదు. స్త్రీల పట్టుదల వల్ల మాత్రమే వారు దేశభక్తి గీతాలు పాడుతూ ప్రభాత్ భేరీలో పాల్గొనడం ప్రచార కార్యక్రమాన్ని నిర్వహించడం విదేశీ వస్త్రాన్ని మద్యం అమ్మే దుకాణాన్ని పికెటింగ్ చెయ్యడం సాధ్యపడింది. అప్పటికీ స్త్రీలది సహాయక పాత్ర మాత్రమే. స్త్రీలు వంటింటిని వదిలేసి, దానిని కాపాడుకోవడానికి తుపాకి పట్టవలసి రావడం, స్త్రీలకు, పురుషులకు కూడా అవమానకరం. అలా చేయడమంటే తిరిగి అనాగరిక దశలోకి వెళ్ళడమేనని గాంధీ అభిప్రాయం. మొత్తం మీద గాంధీ నాయకత్వంలోని జాతీయోద్యమం స్త్రీలను, జన జీవితంలోకి తీసుకు రావడంలో విజయాన్ని సాధించింది. కానీ ఆ విధంగా వచ్చిన వారిలో ఎక్కువ మంది మధ్య, ఉన్నత తరగతి హిందూ స్త్రీలే. దీని ప్రతిధ్వనులు సమాజంలోని

ఇతర స్థాయిలకు చెందిన మహిళల మీద ప్రసరించాయి అయితే హిందూ సమాజంలో స్త్రీల స్థితిగతిలో ఎటువంటి నిజమైన మార్పును గాంధీ ప్రోత్సహించలేదు.

దీనికి పూర్తిగా భిన్నంగా కులవ్యతిరేక ఉద్యమాలు, కమ్యూనిష్టు నాయకత్వంలోని ఉద్యమాలు కింది కులాలకు చెందిన శ్రామికులకు, రైతాంగానికి ప్రాతినిధ్యం వహించాయి. వారిని పెద్ద ఎత్తున సమీకరించాయి. మహారాష్ట్రలో జ్యోతిరావు పూలే, తమిళనాడులో పెరియార్‌ల నాయకత్వంలో సాగిన బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమం, అంబేద్కర్ నాయకత్వంలో దళిత ఉద్యమం, కుల వ్యవస్థ నిర్మాణాన్ని, బ్రాహ్మణిజాన్ని, వాటితోపాటు పితృస్వామ్యాన్ని ఎదిరించాయి. సనాతన బ్రాహ్మణుల నుండి, తీవ్రమైన వ్యతిరేకతను ఎదుర్కొంటూనే పూలే 1849 నాటికే మహర్, మాంగ్ కులాలకు చెందిన అంటరాని బాలికల కోసం పాఠశాలను ప్రారంభించారు. పూలే స్థాపించిన సత్యశోధక్ సమాజ్ సభ్యులు, తమ కొడుకులకు, కూతుళ్ళకు కూడా విద్య నేర్పిస్తామని ప్రమాణం చేయాల్సి వచ్చేది. బ్రాహ్మణ హిందూ వితంతు స్త్రీల పిల్లలకోసం పూలే శరణాలయాన్ని స్థాపించాడు. అటువంటి ఒక బిడ్డను తాను స్వయంగా దత్తత తీసుకున్నాడు. పూనాలో వితంతు స్త్రీలను హింసించే ఆచారానికి వ్యతిరేకంగా మంగలి వాళ్ళు నిర్వహించిన సమ్మెకు ఆయన నాయకత్వం వహించాడు. స్త్రీల హీనస్థితి గురించి పూలే ఎంతో ఉద్వేగంతో రచనలు చేశాడు. భాష విషయంలో కూడా ఆయన ఎంతో చైతన్యాన్ని ప్రదర్శించేవాడు. ప్రతి రంగంలోనూ స్త్రీలకు, పురుషులతో సమానంగా ప్రాతినిధ్యం లభించాలని నొక్కి చెప్పడం కోసం పురుష పక్షపాతంతో కూడిన "మనుష్" అనే పదానికి బదులు "సర్వ ఏకాందర్ స్త్రీ పురుష్" అనే పదాన్ని వాడేవాడు.

దశాబ్దాల తరువాత తమిళనాడులో మరింత ముందుకు వెళ్ళి మంగళసూత్రాలు తిరస్కరించాలని పురుషులకు స్త్రీలకు ఒకే రకమైన వస్త్రధారణ వుండాలని, బాలికలకు మొగ పేర్లు పెట్టాలని ఇంటి పనుల్లో పురుషులు సహాయపడాలని పిల్లల పెంపకంలో పురుషులు సమాన బాధ్యత తీసుకోవాలని పిలుపునిచ్చాడు. బ్రాహ్మణ పురోహితుల్ని, సాంప్రదాయక కర్మకాండల్ని తిరస్కరించడం ద్వారా పూలే, పెరియార్‌లు ఇద్దర్నీ కుల భావజాలాన్ని ధిక్కరించారు. స్త్రీ, పురుష సమానత్వాన్ని నొక్కి చెప్పే విధంగా వివాహ పద్ధతుల్ని రూపొందించారు.

వారి భావజాలం ప్రజాస్వామికమైనది. తొలి సంఘ సంస్కరణ ఉద్యమాల ఉదారవాద ఫెమినిజాన్ని దాటి అది ముందుకు వెళ్ళింది. కాని వారు చారిత్రక భౌతిక వాదులు కాకపోవటం చేత కుల అణిచివేతకు, స్త్రీల అణిచివేతకు మూలాన్ని భూస్వామ్య ఆర్థిక వ్యవస్థలో కాక హిందూ మతంలోను, సంస్కృతిలోను చూశారు. అందుచేత కొందరు సామాజిక శాస్త్రవేత్తలు దీనిని సోషల్ ఫెమినిస్టు ధోరణులు అని పిలిచారు. స్త్రీల అణిచివేత సమస్యకు చారిత్రక భౌతికవాద వివరణను యిచ్చి వారి సంపూర్ణ విముక్తికి పిలుపునిచ్చింది మొదటిగా కమ్యూ నిస్టులే. కమ్యూనిస్టులు సంస్కరణ వాదులకు గుణాత్మకంగా భిన్నమైన పద్ధతిలో నిర్మాణం చేశారు. వారు పునాది వర్గాలకు చెందిన కార్మికులను, రైతాంగాన్ని క్రియా శీలన పోరాటాలలోకి సమీకరించారు.

వారు ప్రారంభం నుండి కార్మిక సంఘాలలో మహిళా కార్మికుల పాత్రను పెంచటానికి కృషి చేశారు. బొంబాయి, షోలాపూర్‌లలోని బట్టల మిల్లులలో పని చేసే మహిళా కార్మికులు అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు చెందిన కార్మిక సంఘాలలో నిర్వహించిన పాత్రను బట్టి దీనిని గమనించవచ్చును. కమ్యూ నిస్టులు మొదట తమ స్వంత మహిళా సంఘాలను స్థాపించుకున్నారు. బెంగాల్‌లో మహిళా ఆత్మరక్షా సమితి, ఆంధ్ర మహిళా సంఘం, పంజాబ్ మహిళా ఆత్మ రక్షణా సమితి వంటివి దీనికి ఉదాహరణలు. ఈ సంస్థలన్నీ స్త్రీల మధ్య పనిచేసి 1944 నాటికి తమ సభ్యత్వాన్ని వరుసుగా 43 వేలు, 20 వేలు, 13 వేలకు పెంచు కున్నాయి. వీరు స్త్రీలను, విద్యార్థినులను సమీకరించారు. తరువాత కాలంలో ఈ సంస్థలకు చెందిన మహిళలు అఖిలభారత మహిళా సంస్థలో చేరారు. ఈ సంస్థలు మత తత్వానికి వ్యతిరేకంగా పోరాడాయి. కరువు కాలంలో దొంగ నిల్వలను వెలికి తీసే కార్యక్రమాలకి, ధరల పెరుగుదలకు వ్యతిరేకంగా జరిగిన క్రియాశీలక ప్రజా ఉద్యమాలకు నాయకత్వం వహించాయి. హిందూ కోడ్ బిల్లు ప్రచార కార్యక్రమంలో కమ్యూనిస్టులు మాత్రమే సనాతన సాంప్రదాయ వాదులను ఎదుర్కొంటూ స్త్రీలను, పురుషులను సమీకరించి బిల్లుకు మద్దతుగా ప్రజా ప్రదర్శనను నిర్వహించారు. కమ్యూనిస్టులు తెభాగా తిరుగుబాటులను, తెలంగాణా ప్రజా పోరాటంలోను, కేరళలో పున్నప్ర వాయలార్ తిరుగుబాటులోను స్త్రీలను ప్రత్యక్ష క్రియాశీలక కార్యాచరణ లోకి దించారు. తెభాగా, తెలంగాణా ఉద్యమాలలో స్త్రీలు వాస్తవంగా సాయుధ

చర్యలలో పాలు పంచుకున్నారు. తెలంగాణా పోరాటం చివరి దశలో కిసాన్ సభ కార్య కర్తలు అజ్ఞాతవాసంలోకి వెళ్ళవలసి వచ్చినపుడు, పురుషులు గ్రామాలు వదిలి పారి పోవలసి వచ్చినపుడు స్త్రీలు మాత్రమే మిగిలిపోయారు. హిందూ, ముస్లిం, దళిత గిరిజన స్త్రీలు అప్పటికప్పుడు చొరవ తీసుకొని కలిసికట్టుగా నారీ వాహిణులు అనే పేరిట స్త్రీల దళాలను ఏర్పాటు చేసి, తమ గ్రామాలను పొలాలను రక్షించుకున్నారు. తెలంగాణాలో ప్రత్యేకంగా మహిళా దళాలుండేవి కావు. దళాలలో చేరటానికి అనేక మంది స్త్రీలు ముందుకు వచ్చినప్పటికి ఒక్కొక్క సాయుధ దళంలోను ఇద్దరు స్త్రీలు చేరటానికి అనుమతి ఇచ్చారు.

కమ్యూనిస్టులు స్త్రీలకు సంబంధించిన చట్టపరమైన సంస్కరణల కోసం ఉద్యమాలు నిర్వహించారు గాని స్త్రీల సమస్యలను వాటంతటవిగా పెద్ద ఎత్తున పట్టించుకోలేదు. తాగుబోతు భర్తలకు వ్యతిరేకంగాను స్త్రీలను కొట్టటానికి వ్యతి రేకంగాను స్త్రీలు డిమాండ్ చేసినపుడు మాత్రము పట్టించుకున్నారు కమ్యూనిస్టు పార్టీ డాక్యుమెంట్లలో కూడా స్త్రీల అణిచివేత పట్ల తక్కువ శ్రద్ధ మాత్రమే చూపించారు. కమ్యూనిస్టులు శ్రామిక మహిళలను విస్తృతమైన వర్గ సమస్యలమీద ఆర్గనైజ్ చేశారు. వారి దృష్టిలో కార్మికులు అంటే మగవారు మాత్రమే. "మేం మహిళా కార్మికులను కేవలం కార్మికులుగానే చూశామేగాని మహిళలుగా కాదు". దీని ఫలి తంగా మహిళలను ద్వితీయశ్రేణి కార్మికులుగా పరిగణించటం కొనసాగింది. స్త్రీలను ప్రాథమికంగా భార్యలుగా, తల్లులుగా మాత్రమే చూపే లైంగిక శ్రమ విభజనకు అంతర్లీనంగా ఆమోదం లభించింది.

ఆస్తి హక్కుకు సంబంధించి కమ్యూనిస్టులు స్త్రీలకు వారసత్వ హక్కు నిచ్చే చట్టపరమైన మార్పులకు మద్దతునిచ్చారు. అయితే C.P I. నాయకత్వంలో జరిగిన ఏ భూ పోరాటంలోను స్త్రీలకు భూమినిచ్చే సమస్యను చేపట్టలేదు. భూస్వా ముల నుండి స్వాధీనం చేసుకున్న భూమిని ఎపుడూ భూమి లేని రైతు కుటుంబాల పెద్దలైన మగవాళ్ళ పేరుమీదే చేశాయి.

## సమకాలీన ఉద్యమం :

1947 తరువాత కాలంలో మహిళా ఉద్యమం నీరసించి పోయింది. దీనికనేక కారణాలున్నాయి. (ఒకటి) వివిధ రాజకీయ, సాంఘిక ఉద్యమాలు నీరుగారి పోవ

టం, తెలంగాణా ఉద్యమ విరమణ అనంతరం కాంగ్రెస్ నుండి సి పి ఐ. వరకు అన్ని ప్రధాన రాజకీయ పార్టీలు ఎన్నికల రాజకీయాలలో కూరుకుపోవటం. గత ఉద్యమాల సందర్భంగా సమీకరించబడ్డ మహిళలు తిరిగి ఇళ్ళకు, వంటిళ్ళకు పరిమితమయి పోయారు. అతికొద్దిమంది మాత్రమే రాజకీయ నిర్మాణంలో స్థానాన్ని సంపాదించగలిగారు. (రెండు) నెహ్రూ ప్రభుత్వం సాంఘిక సంక్షేమ విధానాన్ని ప్రవచించింది. సాంఘిక సంస్కరణలను తీసుకురావటానికి రాజ్యం ఒక సాధనంగా ఉపయోగపడుతుందని ప్రచారం చేయబడింది. ఆలస్యంగానైనా, విరిప్తంగానైనా పార్లమెంటు చేసిన కొన్ని చట్టాలు (హిందూ స్త్రీలకు ఆస్తిలో పరిమితమైన వారసత్వపు హక్కుల నివ్వడం, వివాహం, విడాకులు మొదలైనవాటిపై) స్త్రీల విముక్తికి చట్టంలో జరిగే మార్పులే ఒక ప్రధాన సాధనంగా పరిగణించబడింది. అంతేగాక చురుకైన, క్రియాశీలక మహిళా కార్యకర్తలు స్త్రీల విద్య, వైద్యంవంటి అవసరాలను తీర్చే ప్రభుత్వ ధన సహాయంతో నడపబడే సంస్థల్లోకి సమీకరించబడ్డారు.

1960ల చివరి భాగం 1970ల మొదటి భాగంలో భారతదేశాన్ని తీవ్రంగా కుదిపివేసిన, బ్రహ్మాండమైన సాంఘిక, రాజకీయ ఉద్యమాల నుండి సమకాలీన మహిళా ఉద్యమం ఆవిర్భవించింది. కరువు, ధరల పెరుగుదల కొరతలు అవినీతి పెరుగుదల, పార్లమెంటరీ రాజకీయాలలో అస్థిరత్వం, సాంఘిక వైరుధ్యాల తీవ్రతల నేపథ్యంలో ఎక్కడికక్కడే యాదృచ్ఛికంగా తిరుగుబాట్లు, ఆందోళనలు ప్రారంభమయ్యాయి. భూస్వామ్య వ్యతిరేక పోరాటాలకు నక్సల్బరీ ఉద్యమం ఒక విప్లవాత్మకమైన బలమైన రూపునిచ్చి మహిళలతోసహా, విద్యార్థి యువజనులను పెద్ద సంఖ్యలో ఆకర్షించింది. సాంప్రదాయకమైన కుటుంబ పరిమితులకు వ్యతిరేకంగా తిరగబడి మహిళలు రాజకీయ కార్యాచరణలో పాల్గొనడానికి అవసరమైన ప్రోత్సాహాన్ని విప్లవ వెల్లువయిచ్చింది. జయప్రకాశ్ నారాయణ చేత ఉత్తేజాన్ని పొందిన విద్యార్థి ఉద్యమం పెద్ద సంఖ్యలో విద్యార్థినులను సమీకరించింది. వారు సాంఘిక వత్తిళ్ళను ధైర్యంగా ఎదుర్కొన్నారు. అధిక ధరలకు వ్యతిరేకంగా జరిగిన ఆందోళనలలో గృహిణులు మొదటిసారిగా వీధుల్లోకొచ్చి చురుగ్గా ఆందోళనలో పాల్గొన్నారు. మహారాష్ట్రలో దీర్ఘకాలికంగా కొనసాగుతున్న కరువు స్థితి వేలాది మంది రైతాంగం మహిళలు కరువు నివారణా చర్యలలో పాల్గొనేటట్లు, పనికోసం, సమాన వేతనాల కోసం జరిగిన ఆందోళనలో పాల్గొనేటట్లు చేసింది.

అంతర్జాతీయ సంఘటనలు కూడా తమ ప్రభావాన్ని వేశాయి. ప్రాశ్చాత్య దేశాల్లోని మహిళా విముక్తి ఉద్యమం నగరాల్లోని విద్యావంతులయిన స్త్రీలలో కొత్త చైతన్యాన్ని కలిగించింది ఈ ఉద్యమ వత్తిడికి లోబడే ఐక్యరాజ్యసమితి 1970 లను అంతర్జాతీయ మహిళా దశాబ్దంగా ప్రకటించింది. దీని మూలంగా ప్రపంచ వ్యాప్తంగా మహిళల దుస్థితిపై దృష్టి కేంద్రీకరించబడింది. Egther Bossrup తన చారిత్రాత్మక అధ్యయనంలో మహిళలపై పారిశ్రామికీకరణ చెడు ప్రభావాన్ని వివరించింది. ఇటువంటి వాతావరణంలో మహిళల హోదాను పరిశీలించిన కమిటీ 1975లో నివేదికను వెలువరించింది. 1947 నుండి మహిళల హోదా దిగజారి పోతుందన్న కఠోర వాస్తవాన్ని ఆ నివేదిక బయల్పరచింది.

మహిళల హోదా పీడన వంటి సమస్యలను ఆందోళనా దృక్పథం నుండేకాక సైద్ధాంతిక దృక్పథం నుండి కూడా చర్చించడానికి దేశంలోని ప్రధాన నగరాలలో లాంఛనప్రాయంగాని మహిళా బృందాలేర్పడ్డాయి. వారిలో చాలామంది మహిళలకు మావో, ట్రాట్స్కీ భావాలుండేవి. మహిళల పీడనకు మూలం కుటుంబవ్యవస్థ స్వభావం మహిళలపై అభివృద్ధి ప్రభావం వంటి సమస్యలను వారు విశ్లేషించేవారు. వీటిల్లో చాలా బృందాలు మురికివాడల్లో నివసించే మహిళలు మహిళా కార్మికులు, విద్యార్థినులలో కలిసి పనిచేశాయి. నక్సల్బరీ ఉద్యమం చేత ప్రభావితులైన మధ్య తరగతి మహిళలు 1974లో హైదరాబాద్‌లో ఏర్పాటు చేసిన ప్రగతిశీల మహిళా సంఘం (P O W.) ఇలా ఏర్పడిన సంస్థలలో ఒకటి.

అత్యవసర పరిస్థితి తరువాత తలెత్తిన ప్రజాస్వామిక హక్కుల ఉద్యమం మహిళా సమస్యల పునాదిని మరింత విస్తృతం చేసింది. గ్రామీణ పోరాటాల ఫలితంగా మహిళల హక్కుల ప్రశ్న వెలుగులోకి వచ్చింది. భూస్వామ్యానికి వ్యతిరేకంగా సాగిన భోజపూర్ రైతాంగ ఉద్యమం మానభంగాలు, రైతాంగ స్త్రీలను భూస్వాములుపయోగించుకోవటం వంటి సమస్యలను చేపట్టి, భూమిని మహిళల పేరిట దాఖలు పరచటం సమస్యను బుద్ధగయ ఉద్యమం ముందుకు తెచ్చింది. భూస్వామ్య వ్యతిరేక పోరాటాలలోకి సమీకరించబడిన గిరిజన మహిళలు సారాకు వ్యతిరేకంగా ఆందోళన చేపట్టారు. ఈ విధంగా గ్రామాల్లోనూ, నగరాల్లోనూ మహిళా సమస్యలు ముందుకు వచ్చాయి.

మధుర మానభంగం కేసులో వచ్చిన తీర్పు దానికి వ్యతిరేకంగా సాగిన ఆందోళన నగరాలలోని మహిళా ఉద్యమం ముందుకు గెంతటానికి అవకాశా న్నిచ్చింది మానభంగానికి వ్యతిరేకంగా సాగిన ఈ ఆందోళన ఫలితంగా పెద్ద పెద్ద నగ - ల్లోనే కాక చిన్న చిన్న పట్టణాల్లో కూడా మహిళా సంఘా లేర్పడటానికి అవకాశాన్నిచ్చింది. ఈ ఉద్యమంలో పాల్గొందుకున్నవారు రాడికల్ రాజకీయాల చేత ప్రేరేపింపబడ్డ మహిళలు. ఇదంతా యాదృచ్ఛికంగానే జరిగింది. దీనిలో చొరవ తీసుకోవడానికి గాని. నాయకత్వం వహించటానికి గాని అవసరమయిన స్థితిలో ఏ పార్టీ లేదు ఆ దశాబ్దంలో జరిగిన ఏ ప్రజా పోరాటంలోనూ సి.పి ఐ, సి.పి.యం లు ముందు భాగాన లేవు. సోవియట్ సామ్రాజ్యవాదానికి, దాని స్థానిక బంట్లకు విధేయ తను ప్రదర్శించటం, రివిజినిస్టు రాజకీయ పంథాను కలిగి వుండటమే దీనికి కారణం. తీవ్రమయిన రాజ్య అణచివేతను ఎదుర్కొని, చిన్న చిన్న గ్రూపులుగా చిన్నాభిన్న మైన (మా-లె) కమ్యూనిస్టు పార్టీ కూడా, రాజకీయంగా గాని, నిర్మాణపరంగా గాని మహిళా ఉద్యమంలో చొరవ తీసుకునే స్థితిలో లేదు.

1980లో ప్రారంభమయిన మధుర మానభంగం ఆందోళన మానభంగ చట్టాల సవరణను డిమాండ్ చేసే ప్రచార కార్యక్రమంగా మారింది. ప్రారంభంలో అది రాజ్య వ్యతిరేకతను నొక్కిచెప్పింది. మాయాత్యాగి, రమీజాబివంటి పోలీసులు చేసిన అనేక మానభంగాలు వెలుగులోకొచ్చాయి లైంగిక హింసను ఒక ప్రజా సమస్యగా చేసి దాని నర్థం చేసుకోవడానికి ఈ ఆందోళన తోడ్పడింది. మానభంగం కేవలం కామంతో కూడిన చర్య మాత్రమే కాదని, కేవలం ఒక నైతిక సమస్య మాత్రమే కాదని మహిళలకు వ్యతిరేకంగా అధికారాన్ని ప్రదర్శించే ఒక సాధన యని, పీడితులపై, శత్రు మూతాలపై దాడి చేయటానికి అదొక సాధనమని స్పష్టం చేయబడింది. మానభంగానికి గురైన స్త్రీని ఒక 'దిగజారిన' స్త్రీగా పరిగణించరాదు. పాశవికమైన దాడికి గురైన బాధితురాలుగానే పరిగణించాలి.

1981 నాటికి వరకట్నపు హత్యల సమస్య ముందుకు వచ్చింది. అలాంటి హత్యలకు గురైన స్త్రీలు వున్న కుటుంబాలకు వ్యతిరేకంగా ప్రచార కార్యక్రమం సాగింది. కుటుంబ హింస, కుటుంబ అణచివేతలపై దృష్టి సారించింది. మహిళల ఆస్తి హక్కు, వ్యక్తిగత చట్టాలలో మహిళలకు జరుగుతున్న అన్యాయం వంటివి విశ్లే

షించబడి విమర్శించబడ్డాయి. ఈ బృందాలలోని వారందరు నగరాలలోని మధ్యతరగతివారు కావడంచేత, వారి విశ్లేషణలకు, ప్రచారాలకు ప్రసార సాధనాలలో తగినంత ప్రచారం లభించింది. అందుచేతనే వారు సమీకరించగలిగింది కొద్దిమంది మహిళలనే అయినా, చేసిన ప్రచారం మాత్రం విస్తృతమైన ప్రభావాన్ని కలిగించింది రాజకీయ పార్టీల నుండి పురుషుల నుండి స్వతంత్ర ప్రతిపత్తిని కలిగివుండే మహిళా ఉద్యమాన్ని ఈ బృందాలు గుర్తించాయి. ఇటువంటి స్వతంత్ర ప్రతిపత్తిగల మహిళా సంస్థల మహాసభ 1980 అక్టోబరులో జరిగింది.

1982 నుండి వివిధ క్షేత్రాలలో ప్రజాసంస్థలలో మహిళలను సమీకరించటం ప్రారంభమయిందనేది వాస్తవం. బీడీ కార్మికులు, ఇంటి చాకిరీ చేసే కార్మికులు, మురికివాడల్లో నివసించేవారు తమ తమ ప్రత్యేక డిమాండ్ల సాధనకోసం వీధుల్లోకి వచ్చారు. ప్రభుత్వరంగ సంస్థల్లో గుమస్తాల స్థాయినుండి, మేనేజర్ల స్థాయి వరకు పనిచేస్తున్న మహిళలనందర్నీ సమీకరించి, ఉద్యోగినుల జాతీయ సమన్వయ కమిటి ఏర్పడింది. తాము పనిచేసే చోట్ల ఎదురవుతున్న లైంగిక వివక్ష సమస్యలను చర్చించుకోవడానికి రెండు సమావేశాలు జరిగాయి. ఈ కమిటీ నేర్పరచటంలో C.I.T U. చొరవ చూపింది. స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన మహిళా ఉద్యమ ప్రభావ ఫలితంగా వివిధ రాజకీయ పార్టీలు మహిళా సంఘాలను స్థాపించాయి. తమ రాజకీయ పంథాకు మద్దతుగా మహిళలను సమీకరించటానికి జనతాదళ్, సంయుక్త సోషలిస్టు పార్టీ, వివిధ దళిత పార్టీలు మహిళా సంఘాలను ఏర్పాటు చేశాయి. సి.పి.ఐ, సి.పి యం లు కూడా తమ మహిళా సంఘాలను చురుగ్గా పని చేయించటం ప్రారంభించాయి. C.P.M, ముస్లిం మహిళల రక్షణ చట్టానికి వ్యతిరేకంగా లోక్ సభ ముందు ప్రదర్శన జరిపింది. దేశంలోని అనేక నగరాల్లో, పట్టణాల్లో - కొన్ని స్వతంత్రమైనవి, కొన్ని రివిజనిస్టు పార్టీలకు వెలుపల వున్న వామపక్ష, విప్లవ ధోరణులను సమర్థించేవి - అనేక మహిళా సంఘాలు ఏర్పడ్డాయి.

అదే సమయంలో, అనేక మహిళా సంస్థలు, ఆపదలోవున్న స్త్రీలకు సహాయం చేయడానికి అవసరమైన నిర్మాణాలను ప్రారంభించాయి. అవసరమైన సహాయక సంస్థలు లేకపోవడం మూలంగానే వరకట్న హత్యలు, మానభంగ కేసులు, కుటుంబ హింసలకు వ్యతిరేకంగా సాగుతూన్న ప్రచార కార్యక్రమం కుంటి నడక సాగుతోందని వారు విశ్లేషించుకున్నారు. ప్రభుత్వం నుండి, విదేశీ వనరుల నుండి

లభించిన విరాళాల సాయంతో, స్వయం-ఉపాధి కేంద్రాలు, సలహా కేంద్రాలు స్థాపించ బడ్డాయి. స్త్రీల హోదా, వివిధ రకాల పీడనలపై సైద్ధాంతిక, పరిశోధనా కార్య క్రమాల్లో చాలామంది నిమగ్నులైనారు. మహిళా దృక్పథం నుండి చరిత్రను తిరిగి వ్యాఖ్యానించడానికి, మహిళా పోరాటాల చరిత్రను, సాంఘిక ఉద్యమాలలో మహి ళల పాత్రను వెలికితీయడానికి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి.

1986 ప్రాంతాలనుండి గ్రామీణ మహిళలల్లో కూడా చైతన్యం వెల్లివిరియ డాన్ని గమనించవచ్చును. రైతు సంఘాలు - ధనిక రైతుల నాయకత్వంలో వున్న వైనా, విప్లవ నాయకత్వంలో వున్నవైనా - మహిళా సమస్యల్ని పట్టించుకోవడం, కొందరు మహిళా సంఘాలను స్థాపించడం జరిగింది. 1986 లో చాంద్వాల్లో షేత్ కారీ సంఘటన 20,000 మంది రైతాంగ మహిళలను సమీకరించడం, షేత్‌కారీ మహిళా అగాదీ స్థాపన దీనికి నిదర్శనాలు. తికాయత్ నాయకత్వంలోని B K U. కూడా, దీని ఉచ్ఛస్థితిలో (1989-90) వరకట్నం వంటి స్త్రీల సమస్యలను పట్టించు కున్నది. బీహారు, ఆంధ్రప్రదేశ్‌లలో మార్క్సిస్టు-లెనినిస్టు నాయకత్వంలో ఉన్న రైతు-కూలీ సంఘాలు మహిళా సంస్థలను స్థాపించాయి. CPI - ML (PW) నాయకత్వంలో గత రెండేళ్ళలోను, గడ్‌ఛిరోలీ, ఆదిలాబాద్‌లలో గిరిజన మహిళల మహాసభలు జరిగాయి. పోలీసుల అణచివేతకు, మహిళల పట్ల వివక్షతను చూపే సాంప్రదాయాలు, కట్టుబాట్లకు వ్యతిరేకంగా ప్రచార కార్యక్రమాన్ని చేపట్టారు. ఆంధ్రప్రదేశ్‌లో యాదృచ్ఛికంగా ప్రారంభమై బ్రహ్మాండంగా సాగిన సారా వ్యతి రేక ఉద్యమం, గ్రామీణ ప్రాంత స్త్రీలలో ఇప్పటికీ నిద్రాణంగానే వున్నప్పటికీ క్రమంగా జాగృతమవుతూన్న మహిళా శక్తికి నిదర్శనం.

## రాజ్య ప్రతిస్పందన

భారత పాలకవర్గాలు, మహిళా ఉద్యమానికి చురుగ్గా ప్రతిస్పందించాయి. వాటిని తమలో సంలీనం చేసుకోవడానికి, లేదా లోపల నుంచి నాశనం చేయడానికి, లేదా అణచి వేయడానికి ప్రయత్నించాయి. మహిళా ఉద్యమాల ద్వారా సృష్టించ బడిన చైతన్యంతో, విద్యావంతులైన మధ్యతరగతి వర్గాల మహిళలు, ఇంతకాలం మగవాళ్ళు మాత్రమే ప్రవేశించగల్గిన వృత్తులలోకి, పరిపాలక యాజమాన్య హోదా ల్లోకి ప్రవేశించారు. ఈ శ్రేణులకు చెందిన మహిళలు, స్వతంత్ర ప్రతిపత్తి గల

మహిళా ఉద్యమంలో అగ్రభాగాన నిలిచారు. ఈ ఉద్యమ ప్రాధాన్యతను గుర్తించిన ప్రభుత్వం మహిళల్లో ఉద్యోగ అవకాశాల మెరుగుదల అవకాశాలను తన ప్రసార సాధనాల ద్వారా విపరీత ప్రచారాన్ని కల్పించింది. విద్యావంతులైన మధ్యతరగతి మహిళలలో అణగారిన ఆకాంక్షలను సంతృప్తి పరచడానికి పాలకవర్గాలు అనేక విధాలుగా ప్రయత్నించాయి ఈ బూర్జువా వ్యవస్థలో మహిళలు సమానత్వాన్ని కోరకుండా నిరోధించడానికి ప్రయత్నించాయి. ఈ దోపిడీ వ్యవస్థను మహిళలు ఎదుర్కోకుండా నిరోధించడనికి ప్రయత్నించాయి.

మహిళా సమస్యల పట్ల తాము కూడా స్పందిస్తున్నామనే అభిప్రాయాన్ని కలిగించడానికి, స్వతంత్ర ప్రతిపత్తి గల మహిళా సంఘాల నాయకత్వాన్ని కో - ఆప్ట్ చేసుకోవడానికే ప్రభుత్వం అనేక చర్యలు తీసుకొన్నది. అవి :

1) ఫెమినిస్టు నాయకులతో కలిపి మహిళా కమీషన్‌ను ఏర్పరచడం.
2) మహిళా పోలీసు కేంద్రాలను ఏర్పాటుచేసి, మహిళా కార్యకర్తలను దానిలో నియమించడం.
3) మహిళా అధ్యయనానికి ఉదారంగా నిధులు సమకూర్చడం.
4) మహిళలకు సహాయం చేసే సంస్థలకు నిధులు ఇవ్వడం. వాటిని తమ ఆజమాయిషి, నియంత్రణల లోనికి తీసుకోవడం.
5) మహిళా సమస్యలకు సంబంధించిన చట్టాలను సవరించడం, కొత్త చట్టాలను ప్రవేశపెట్టడం.

రాజకీయ పరిధిలోకి మహిళలను భాగస్వాములను చేయడంకోసం పంచాయితీలు, జిల్లా పరిషత్తులు, మున్సిపాలిటీలలో స్త్రీలకు రిజర్వేషన్లు కల్పించారు. ఈ విధంగా చేయడంద్వారా ధనికులు, అభివృద్ధి నిరోధక ప్రాబల్యంలో వున్న ప్రస్తుత అప్రజాస్వామిక నిర్మాణం, మహిళల ప్రయోజనాలకు అనుగుణంగా ప్రతిస్పందించగలదని నమ్మింపచేయడానికి వాళ్ళు ప్రయత్నిస్తున్నారు.

కేంద్ర, వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు విదేశీ సంస్థలనుండి లభించిన నిధుల సహాయంతో మహిళలకు ముఖ్యంగా గ్రామీణ మహిళల అభివృద్ధికి పథకాలను ప్రారంభించాయి. ప్రభుత్వం చేత రూపొందించబడుతోన్న ఆర్థిక పథకాలలో తమ వంతు పాత్రను నిర్వహించటానికి వీలుగా స్త్రీలలో అక్షరాస్యతను, జ్ఞానాన్ని, సాంకే

తిక నిపుణత్వాన్ని కలిగించటం కోసం ఈ పథకాలు ఉద్దేశించబడ్డాయి. కర్నాటక, రాజస్థాన్ రాష్ట్ర ప్రభుత్వాలు తమ నిర్వహిస్తోన్న మహిళా అభివృద్ధి పథకాలకు నాయకత్వ స్థానంలో మహిళా కార్యకర్తలను పరిశోధకులను నియమించాయి.

ఈ విధంగా ప్రభుత్వమూ, పాలక వర్గాలు కుల అంతరాలను బద్దలు కొట్టడానికి, గ్రామాలలో వర్గ సంబంధాలలో మార్పులు తీసుకురావడానికి జరుగుతున్న ప్రయత్నాలను, పాశవికంగా అణచివేస్తూనే, T.V, వ్యాపార సినిమాలద్వారా మహిళలను హీనంగా కావాలని చిత్రీకరిస్తూ, మహిళా వ్యతిరేక స్వభావం కలిగిన న్యాయ వ్యవస్థను పెంచి పోషిస్తూ మరోవైపున పైన పేర్కొన్న చర్యలను చేపట్టడం ద్వారా తాము అభ్యుదయవాదులమనే ఫోజు పెట్టడానికి ప్రయత్నిస్తున్నాయి. అదే సమయంలో రైతాంగ పోరాటాలు, జాతి పోరాటాలలో పాల్గొన్న మద్దతునిస్తున్న స్త్రీలపై తీవ్ర అణచివేతను ప్రారంభించింది. చాలామంది మహిళలు ఎదురుకాల్పుల్లో చంపబడటం, అరెస్టులు చేయబడటం, చిత్రహింసల ద్వారా చంపబడటం ప్రత్యేక పోలీసు సైనిక బలగాల చేతుల్లో మానభంగాలకు గురి కావడం జరుగుతోంది. ప్రజా పోరాటాలు తీవ్రమవుతున్న కాశ్మీరు, తెలంగాణా వంటి చోట్ల, మానభంగాన్ని, అణచివేత సాధనంగా విస్తృతంగా ఉపయోగిస్తున్నారు. ఈ విధంగా ప్రజా ఉద్యమాలలో పాల్గొంటున్న మహిళలపై జరుగుతున్న అణచివేత చర్యలు ప్రజల దృష్టికి రాకుండా చర్యలు చేపడుతోంది.

## అభివృద్ధి నిరోధక ధోరణి :

గత దశాబ్దంలో మహిళలను పెద్ద సంఖ్యలో సమీకరించటానికి పూనుకున్న బహిరంగ అభివృద్ధి నిరోధక ధోరణి, బి జె పి నాయకత్వంలోని, హిందూ మతోన్మాద ధోరణి R.S Sకు అనుబంధంగా రాష్ట్రీయ సేవికలు అనే పేరిట ఒక మహిళా సంఘం చాలాకాలం నుండి ఉన్నప్పటికి వాళ్ళు మహిళా విముక్తి ఉద్యమాల ప్రభావం పడనంత వరకు, మహిళలను వీధుల్లోకి తీసుకురాలేదు హిందూ జాతీయతా వాదం ముసుగులో తమ రాజకీయ అవసరాల కోసం అగ్రకుల మధ్యతరగతి మహిళలను పెద్ద సంఖ్యలో సమీకరించటంలో వాళ్ళు విజయాన్ని సాధించారు. అయోధ్యలో కరసేవలోనూ, పెరిగిన ధరలకు వ్యతిరేకంగా సాగిన ఉద్యమంలో పాల్గొన్న మహిళల సంఖ్యను బట్టి వారు ఎంత సఫలీకృతులయింది తెలుసుకోవచ్చు.

ఈ మధ్య కాలంలో దుర్గావాహిని పేరిట మహిళలకు 'హిందూ' ప్రయోజనాలను పరిరక్షించటానికి శిక్షణ యివ్వటానికి వారు ప్రయత్నిస్తున్నారు. సేవ, సంస్కృతి, సంస్కారం అనే మూడు సూత్రాల మీద ఆధారపడి దుర్గావాహినులు నిర్మాణమవుతున్నాయి. ఈ మూడు సూత్రాలు పితృస్వామిక భావజాలాన్ని ప్రతిఫలించేవి. స్త్రీల పాత్రను నిర్దేశించేవే. రాజకీయ వేదికలమీదకి మహిళలను సమీకరిస్తున్నప్పటికీ వారి తాత్విక ధోరణి స్త్రీలు కుటుంబ పరిధిలో నిర్వహించాల్సిన సాంప్రదాయిక పాత్రను సమర్థిస్తుంది. బ్రాహ్మణ సంప్రదాయాన్ని పెంచి పోషిస్తుంది. సతిని సమర్థించే సందర్భంలో బి జె పి నాయకురాలు విజయరాజె సింధియా ఈ ధోరణిని ఎటువంటి సందేహానికి ఆస్కారం లేకుండా, ఇటువంటి భావాన్ని వ్యక్తం చేసింది. మహిళా విముక్తికోసం సాగుతున్న ప్రజాస్వామిక మహిళా ఉద్యమం బలపడాలంటే ఈ అభివృద్ధి నిరోధక ధోరణిని తీవ్రంగా వ్యతిరేకించాలి.

## వుదారవాద ఫెమినిస్టు ధోరణి :

ఈ ధోరణికి చెందిన ఒక వర్గం - వుదారవాద ధోరణిలో సంబంధానికి కొనసాగింపుగా - స్త్రీలకు కుట్లు నేర్పడం, హాస్టళ్ళు నిర్వహించడం వంటి సంక్షేమ పథకాలను నిర్వహిస్తున్నాయి. సామాజిక సేవా కార్యక్రమాలద్వారా మహిళల అభ్యున్నతి సాధ్యమవుతుందనే దృక్పథాన్ని వీళ్ళే కొనసాగించారు. వారు పాలక వర్గాలతో సంబంధం కలిగి వుండి, నిధుల కోసం వారిమీద ఆధారపడ్డారు.

ఈ ఉదారవాద ధోరణికి చెందిన రెండోవర్గం - ప్రస్తుతం మహిళా ఉద్యమం మీద ఆధిపత్యం దీనిదే - అసంఘటిత మహిళల్లోనూ పేద మహిళల్లోనూ పనిచేయడంలో నిమగ్నమయివుంది. ఇలాంటి సంస్థలలో ఒకటైన సేవ (SEWA) పట్టణాల్లోని స్వయం ఉపాధి మీద ఆధారపడుకున్న, పేద శ్రామిక మహిళలను వ్యవస్థీకరించి, వారికవసరమయిన సహాయాన్ని అందించడానికి, ఋణ సంస్థలవంటి వాటిని ఏర్పాటు చేస్తున్నది. విదేశీ నిధుల సహాయంతో కొన్ని ప్రభుత్వేతర సంస్థలు గ్రామాలలో వేరొక విధమైన కార్యక్రమాలను నిర్వహిస్తున్నాయి అవి గ్రామాలలో అభివృద్ధి పథకాలను చేపట్టాయి. కొన్ని నిర్దిష్ట సమూహాలకు ముఖ్యంగా గ్రామీణ పేద మహిళల కోసం ఉద్దేశించబడ్డ ప్రభుత్వ పథకాలను అమలు పరచడంలో వీరు పాల్గొంటున్నారు. ఒక దశాబ్దం క్రితం అయితే యివి నేరుగా ఉపాధి కల్పనా పథకా

లను అమలుపరిచేవి. ఇప్పుడు అవి మరింత కపటంగా తయారయ్యేవి. మహిళా సంఘాలను స్థాపించడం వారిని విద్యావంతులను చేయడల పాలనా నిబంధనలకు, చట్టాలకు సంబంధించిన జ్ఞానాన్ని అందించటం తద్వారా ప్రభుత్వం ప్రవేశపెట్టిన వివిధ ఉపాధి కల్పనా పథకాలను వారు ఉపయోగించుకునేటట్లు చేయడం వంటి బాధ్యతలను ఈ ప్రభుత్వేతర సంస్థలు చేపడుతున్నాయి. వీటిల్లో కొన్ని సంస్థలయితే స్థానికంగా వుండే అవినీతిపరులయిన అధికారులు, గ్రామ పెద్దలకు వ్యతిరేకంగా అందోళనలు చేపడుతున్నాయి.

తమ దృక్పథాన్ని వివరించడానికి ఈ సంస్థ వాడే పదజాలం, రాడికల్ పద జాలం లాగా ధ్వనిస్తోంది. ప్రస్తుతం ప్రభుత్వం అనుసరిస్తున్న అభివృద్ధి వ్యూహం స్త్రీలకుకాక, మగవాళ్ళకే ఉపయోగపడుతుందని వీరు విమర్శిస్తున్నారు. వాళ్ళ సామాజిక న్యాయం, సమానత్వం, పేదలను, స్త్రీలను శక్తివంతులను చేయడం వంటి విషయాల గురించి మాట్లాడతారు. అభివృద్ధి పునాది వర్గాల స్థాయి నుండి ప్రారంభం కావాలని గాంధీ, ఫాన్‌లో్ట్రియరీ వంటి ఆలోచనపరుల నుండి ఉత్తేజాన్ని పొందినట్లు మాట్లాడతారు. స్థానిక స్థాయిలో జరగవలసిన మార్పును మొత్తం ఆర్థిక వ్యవస్థలో జరగవల్సిన మార్పుతో అనుసంధానించరు.

నిజానికి అభివృద్ధి అనే అంశం మీద వాళ్ళకు స్పష్టమైన భావాలు లేవు. ప్రభుత్వాని కుండే సమగ్ర అభివృద్ధి విధానాన్ని వీళ్ళు ఎన్నడో గాని ప్రశ్నించరు. పేద వాళ్ళకు, మహిళలకు లాభం కలగాలని మాట్లాడతారు గాని, ప్రస్తుతం వున్న ఆస్తి సంబంధాల గురించి అసమ భూ సంబంధాల గురించి, ప్రస్తుతం అభివృద్ధి వ్యూహాని కున్న సామ్రాజ్యవాద అనుకూల కోణం గురించి గాని వీళ్ళు ప్రస్తావించరు. అందు చేత వారి ఆచరణంతా ప్రభుత్వ పథకాలను సమర్థవంతంగా అమలు పరచడానికే పరిమితమవుతోంది. సామ్రాజ్యవాదులచే ప్రతిపాదించిన, పాలక వర్గాల వ్యూహానికి లోబడి తాము పని చేయడాన్ని సమర్థించుకోవడానికి వారు కొన్ని సైద్ధాంతిక కారణాలను చెప్తున్నారు. తాము హింసకు వ్యతిరేకులమని, వర్గ దృక్పథం యాంత్రికమైన దనీ కారణాలు చెప్తుంటారు. సమస్యలను అర్థం చేసుకోవాలంటే మరింత అభివృద్ధి చెందాలి.

వీటిల్లో చాలా గ్రూపులు - ఎన్నికల రాజకీయాలని, రాజకీయ పార్టీలని వ్యతిరేకించడం అనే నెపంతో స్త్రీలను రాజకీయంగా సమీకరించటం లేదు. రాజకీయాలను ప్రత్య

క్షంగా వ్యతిరేకిస్తూనే, రాజ్యాన్ని, ప్రభుత్వాన్ని ఎదుర్కొనే ఉద్యమాల నుండి మహిళలను బయట వుంచుతున్నారు ఆచరణలో గాని, చర్చలలో గాని రాజకీయ సమస్యలను దరి చేరనీయటం లేదు ఫలితంగా వీళ్ళు స్త్రీలను రాజకీయాలను అవగాహన చేసుకోనీయకుండా చేస్తున్నారు. వాస్తవానికి రాజకీయాలను అవగాహన చేసుకోవటం స్త్రీలకే ప్రయోజనకరం. ఇలా చేయడం వల్ల అభివృద్ధి నిరోధక మతతత్వ పార్టీలు, స్త్రీలను ప్రభావితం చేసి, వీళ్ళని తమ ప్రయోజనాల కోసం వాడుకునే వీలు కలుగుతోంది.

ఈ బృందాలు రాజకీయ పార్టీలను వ్యతిరేకిస్తున్నాయి. 'నిరంకుశం' గాను, 'కార్యకర్తల మీద ఆధారపడిన' పార్టీలుగా వుంటాయన్న కారణంతో వీరు వామపక్ష పార్టీలను వ్యతిరేకిస్తున్నారు. నిరంకుశ పని విధానాన్ని విమర్శించటం ఒకటి. అసలు వ్యవస్థలనే నిరాకరించటం మరొకటి. అవి రాజకీయ నిర్మాణాలను పూర్తిగా వ్యతిరేకిస్తున్నాయి. స్థానిక స్థాయిలో, యాదృచ్ఛికంగా జరిగే ప్రజా కార్యకలాపాలను ప్రోత్సహిస్తారు. ప్రజల చొరవ పెంపొందాలని, తాము నిర్వహించే ఉద్యమాలకు తామే మార్గదర్శకత్వం వహించే అవకాశం ప్రజలకు కలిగించాలనే నెపంతో, వాళ్ళు వ్యూహ రచనని రాజకీయ నిర్వహణ, సంస్థలను వ్యతిరేకిస్తున్నారు.

'లోకాయన' వంటి ప్రభుత్వేతర సంస్థలలో ఈ ధోరణి ఆదరణ పొందింది. ప్రజా పోరాటాలకు మద్దతు ఇస్తున్నట్లు అనిపిస్తూనే ఈ ధోరణి ఈ అసమ, అన్యాయ, దోపిడీ వ్యవస్థను మార్చడానికి అనుసరించవలసిన వ్యూహం ఎత్తుగడల సమస్యను నెట్టి, యాదృచ్ఛికతకు వదిలి వేస్తుంది. ఇది నిజానికి పాలక వర్గానికి మద్దతు పలకడమే. అంతర్జాతీయ పెట్టుబడి బలమైన నిర్మాణం గల శక్తి. భారత పాలక వర్గాలు కేంద్రీకృత రాజ్య యంత్రాంగాన్ని కలిగి ఉన్నాయి. ఈ యంత్రాంగం ద్వారానే వాళ్ళు ప్రస్తుత వ్యవస్థను, మతతత్వం, పురుష స్వామ్యం వంటి అభివృద్ధి నిరోధక భావజాలాలను పెంచి పోషిస్తున్నారు. కానీ ఈ దృక్పథాన్ని సమర్థించేవారి అభిప్రాయంలో మహిళలతో సహా ప్రజలు తమ పీడకులను యాదృచ్ఛికంగానే ఎదుర్కొని విజయాన్ని సాధించగలరు. పాలక వర్గాలకు తమ తరఫున నిలబడే బి జె పి, కాంగ్రెస్ వంటి పటిష్టవంతమయిన నిర్మాణం నిధులు కల రాజకీయ పార్టీలున్నాయి. మహిళలు తమను తామే స్థానికంగా నిర్మాణం చేసుకుంటూ తమ

చొరవ మీద తామే ఆధారపడి యాదృచ్ఛికంగా ఈ పార్టీల భావజాలాన్ని, రాజకీయాలను ఎదుర్కోవాలి. స్వతంత్ర సంస్థల మధ్య వుండే కొద్దిపాటి సమన్వయం ఇలాంటి అఖిల భారత పార్టీలకు ఏ మాత్రం దీటు కాదు. పార్లమెంటరీ రాజకీయాలను వ్యతిరేకిస్తూ ఆ పార్టీల అవినీతిని నిరంకుశ ఆచరణను విమర్శించడం ఒక ఎత్తు, అసలు నిర్మాణానికే ప్రత్యామ్నాయంగా కేవలం స్థానిక నిర్మాణాన్ని ప్రస్తావించటం మరొక ఎత్తు ఎక్కడికక్కడ స్థానికంగా వుండే చిన్న చిన్న మహిళా బృందాలే వ్యవస్థను మార్చగలవనే భ్రమ దీనివల్ల కలుగుతోంది. ఈ భ్రమ మహిళలు రాజకీయంగా చైతన్యవంతులు కాకుండా అడ్డుపడుతుంది. స్నేహితులెవరో, శత్రువులెవరో తెలుసుకోకుండా నిరోధిస్తుంది. ఇలాంటి దృక్పథం, ప్రజల్ని నిరాయుధులను చేస్తుంది వారిలో పోరాట పటిమను కుంటుపరుస్తుంది. పాలక వర్గాల రాజకీయాలను భావజాలాన్ని కుటిల ఎత్తుగడలను ఎదుర్కోవాలంటే మిగిలిన పేద పీడిత ప్రజల వలె స్త్రీలకు కూడా నిర్దిష్టమైన వ్యూహం అవసరం. దీనికి జ్ఞానం, వనరులు పోరాట పటిమ అవసరం. ఇవి విస్తృతమైన నిర్మాణంలో భాగంగా మాత్రమే లభిస్తాయి. పోరాటాల క్రమంలో మహిళలను శక్తివంతులను చేసే ఒక అఖిల భారత విప్లవ రాజకీయ పార్టీ ద్వారానే మహిళా విముక్తి సాధ్యమవుతుంది.

ఈ ఉదారవాద ధోరణికి చెందిన చాలా బృందాలు ఈ మధ్యకాలంలో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ గాంధీవాదాన్ని ప్రచారం చేస్తున్నాయి. మహిళా సమస్యలకు ఆర్థిక, సాంఘిక అంశాలతో ఉన్న సంబంధాలను గుర్తిస్తూనే వాటిని గాంధియన్ దృక్పథంతో పరిష్కరించాలని వీరు చెప్తున్నారు. దానర్థం ప్రస్తుత అభివృద్ధి వ్యూహాన్ని ప్రశ్నించటమంటే పారిశ్రామికీకరణను సంపూర్ణంగా తిరస్కరించటం, అహింసా పోరాటాలను సమర్థించటం. ఈ ఉదారవాద బూర్జువాలకు పాలకులను నడిస్తున్న సామ్రాజ్యవాద అనుకూల అభివృద్ధి వ్యూహాన్ని గాని, వ్యవస్థీకృతమైన రాజ్య హింసను గాని నిర్దిష్టంగా ఎదుర్కొనే శక్తి లేదు. మహిళలకు ప్రస్తుత వ్యవస్థలో నమ్మకాన్ని కలిగించటానికి, విప్లవాత్మకమైన మార్పును సాధించే పంథా నుండి వారిని దారి మళ్ళించడానికి ఇది భావజాల పాత్రను నిర్వహిస్తుంది.

## రాడికల్ ఫెమినిస్ట్ ధోరణి :

ఈ ధోరణి అభిప్రాయంలో సమాజంలో ప్రధాన వైరుధ్యం పురుషుడికి-స్త్రీకి మధ్య ఉంటుంది. పురుషుల లైంగిక పీడన కారణంగానే, మహిళలు అస్వతంత్రు

లయ్యారు. వర్గ సంబంధమయిన తేడాలు, వివిధ సామాజిక ఆర్థిక సూత్రీకరణలతో సంబంధం లేకుండా పితృస్వామిక నిర్మాణంలో పురుషులు స్త్రీల పట్ల ప్రదర్శించే అణచివేత ప్రధాన వైరుధ్యం. మిగిలినవన్నీ దీనికి కొనసాగింపే. ఈ ధోరణి స్త్రీ, పురుషుల మధ్య వుండే శరీర సంబంధమయిన, సహజ సిద్ధమయిన లేక అంతర్లీన మయిన వ్యత్యాసాలను నొక్కి చెప్తుంది. ప్రకృతితో సామీప్యత, పెంచి పోషించే తత్వం ప్రజాస్వామిక సమష్టి తత్వం, శాంతి పరిరక్షణ వంటివి స్త్రీలలో సహజ సిద్ధంగా, అంతర్లీనంగా ఉండే లక్షణాలని వీటు నొక్కి చెప్తారు. పురుషాధిక్యతకు, హింసకు పురుషుడిలో అంతర్లీనంగా వుండే లక్షణాలే కారణమవి ఈ ధోరణి అభి ప్రాయం.

రాడికల్ ఫెమినిజం దాని నిజమైన రూపంలో కొద్దిమంది వ్యక్తులు చిన్న చిన్న బృందాలలో తప్ప, భారతదేశంలో కనబడదు. అయితే వారి భావాలు ఇతర ధోరణులను ప్రభావితం చేశాయి. ఈ మధ్యకాలంలోనే వచ్చిన పర్యావరణ ఫెమి నిజం (eco-feminism) రాడికల్ ఫెమినిజానికి దగ్గరగా ఉంటుంది. పర్యావరణ ఫెమినిజం అంటే, ఫెమినిజాన్ని పర్యావరణను కలిపే ప్రయత్నం. దాన్ని ఈ క్రింది విధంగా వివరించవచ్చును.

"పర్యావరణ ఫెమినిజం స్త్రీత్వ లక్షణాలయిన, జాగ్రత్త తీసుకోవడం, పెంచి పోషించడం, సహనం కలిగి వుండటం వంటి వాటి విలువను గుర్తించి దానివి పర్యావరణకు అన్వయిస్తుంది. భూమి మీద పితృస్వామిక ఆధిపత్యాన్ని వివరించడం ద్వారా ఫెమినిజం పర్యావరణానికి ఒక రాజకీయ అవగాహనను అందించింది". (Women's Environmental Net Work - May 1991)

ఈ ధోరణి పర్యావరణానికి హాని కలిగించే పథకాలకు విధానాలకు వ్యతిరే కంగా తమ వాణిని వినిపించినా, అటువంటి పథకాలకు వ్యతిరేకంగా సాగిన ప్రజా ఉద్యమాలకు మద్దతు ఇచ్చిన, దానిది ఒంపెద్దు ధోరణి. పురుషులకూ, స్త్రీలకూ మధ్య ఉండే శరీర సంబంధమయిన వ్యత్యాసాలను నొక్కి చెప్పడం ద్వారా, ఈ విధ మైన వ్యత్యాసాల మూలంగానే స్త్రీ - పురుషుల మధ్య మనస్తత్వంలోనూ, సాం స్కృతి కాంక్ష్యలలోనూ, తేడాలున్నాయని చెప్పడం ద్వారా, వారు స్త్రీ, పురుష విభ జన సహజమైంది శాశ్వతమైనదిగా చేసేశారు. అంతేగాని అది సాంఘికమైనది,

మార్పులకు లోనయ్యేదిగా గుర్తించలేదు. ఈ దృక్పథం దీర్ఘకాలంలో మహిళా ఉద్యమానికి నష్టదాయకం. స్త్రీత్వ లక్షణాలను నొక్కి చెప్పడమంటే అర్థం ప్రస్తుత దోపిడీ సామాజిక వ్యవస్థలో పురుషుల స్థానంలో స్త్రీలను వుంచినంత మాత్రానే హింస, అవినీతి వంటి అన్ని చెడులు తొలగిపోతాయని భావించడమే. ఆర్థిక, రాజకీయ వ్యవస్థను, దాని చారిత్రక నేపథ్యాన్ని నిర్లక్షం చేసే, ఇటువంటి అవాస్తవిక ధోరణి, మహిళా విముక్తికి సరైన మార్గాన్ని సూచించదు. స్త్రీల మూలాన్ని ఆధ్యాత్మికతలో వెతకటానికి ప్రయత్నించటమే ఆధ్యాత్మిక ధోరణి. అయితే స్త్రీలు వాస్తవంగా జీవించే భౌతిక పరిస్థితులతో సంబంధం లేకుండా వారికి సంబంధించిన ఆధ్యాత్మిక పునాదిని వెతకటానికి ప్రయత్నం చేస్తే మనకు ఏకపక్షమైన అవాస్తవికమయిన అవగాహన కలుగుతుంది. ఇది సాంప్రదాయాన్ని విమర్శరహితంగా అంగీకరించటమే.

ఈ దృక్పథం ప్రకృతిలో స్త్రీలకుండే సంబంధాన్ని భావనాత్మక ధోరణిలో వివరిస్తుంది. మహిళలందరూ ప్రకృతిని పరిరక్షించాలని కోరుకుంటారని అనడం పూర్తి వాస్తవం కాదు. మన దేశంలో ఉన్నత వర్గాల మహిళలు వినిమయ సంస్కృతిని, సామ్రాజ్యవాదుల పర్యావరణ వ్యతిరేక సంస్కృతిని సమర్థిస్తారు. ఉన్నత వర్గాల వారి శిష్ట జీవన విధానం ఈ అభివృద్ధి విధానం మీద ఆధారపడిందే. కాబట్టి మహిళలలో వుండే వర్గ వ్యత్యాసాలకు ప్రాముఖ్యత ఉన్నది. ఈ దృక్పథాన్ని కలిగినవారు చేసినట్లుగా దానిని నిర్లక్ష్యం చేయరాదు.

**సోషలిస్టు - ఫెమినిస్టు ధోరణి :** ఇది మూడవ ప్రధాన ధోరణి. భారత దేశంలో మహిళా ఉద్యమం మీద శక్తివంతమైన ప్రభావాన్ని వేసింది. ఈ ధోరణి కలిగినవారు ప్రధానంగా పాశ్చాత్య సోషలిస్టు ఫెమినిస్టు రచనలద్వారా ప్రభావితులయినవారు. ఈ ధోరణిని సమర్థిస్తున్న ముఖ్యులు ఏదో ఒక సమయంలో మార్క్సిజాన్ని సమర్థించిన ఏదో ఒక గ్రూపు లేదా పార్టీకి - రివిజనిస్టు లాల్ నిషాన్ పార్టీనుండి మార్క్సిస్ట్-లెనినిస్టు ధోరణి వరకు చెందినవారే. సోషలిస్టు, ఫెమినిస్టులు మహిళా అధ్యయనం పరిశోధనలు నుండి ప్రజా కార్యాచరణ వరకు విస్తృత వైవిధ్యం కల కార్యాచరణలో నిమగ్నులై వున్నారు. దోపిడీ మీద ఆధారపడ్డ వర్గ సంబంధాలకు ఆదె దోపిడీ మీదఆధారపడ్డ స్త్రీ పురుష సంబంధాలకు వ్యతిరేకంగా పోరా

డాల్సిన అవసరాన్ని సోషలిస్టు ఫెమినిస్టులు నొక్కి చెపుతారు అందుకే వారు వర్గ దోపిడీకి పితృస్వామ్యానికి వ్యతిరేకంగా జరిగే పోరాటానికి సమాన ప్రాధాన్యతను ఇస్తారు. సాంఘిక సంబంధాలలోను పార్టీలు, గ్రూపులు వంటి రాజకీయ నిర్మాణంలోను వ్యక్తీకరించబడుతున్న పురుషాధిక్యత మీద దృష్టిని కేంద్రీకరించటమే దీని ఆచరణ. గడిచిన కాలంలో సోషలిస్టు ఫెమినిస్టులు మహిళా ఉద్యమానికి స్వతంత్ర ప్రతిపత్తి వుండాలని ప్రచారం చేశారు. విప్లవ అవసరాన్ని ప్రచారం చేయటానికి బదులు మహిళలు పార్లమెంటరీ రాజకీయాల ప్రధాన స్రవంతిలో పాల్గొనాలని వారిని ప్రోత్సహించారు.

కుటుంబ వ్యవస్థలో స్త్రీల లొంగుబాటుతనం, సాంప్రదాయక లైంగిక వర్గీకరణను పెట్టుబడిదారీ విధానం మహిళలను దోచుకోవటానికి, లాభాలను ప్రోగు చేసుకోవటానికి ఉపయోగించుకోవటానికి, ఇంటి చాకిరిని విశ్లేషించటం, పితృస్వామిక అనుకూల లైంగిక విలువలు స్త్రీల అణచివేత వంటి అంశాల మీద సోషలిస్టు ఫెమినిస్టులు సిద్ధాంతపరమైన రచనలు చేసి వాటిని అభివృద్ధి చేశారు.

సోషలిస్టు - ఫెమినిస్టులలో కొందరు తమ విశ్లేషణాశక్తికి సిద్ధాంతాలను రూపొందించే శక్తికి ప్రజల మీద ప్రభావాన్ని కలిగించటంలో ప్రసార సాధనాలను ఉపయోగించుకొనే శక్తికి ఎక్కువ విలువనిచ్చి ప్రజా సమీకరణ ప్రాధాన్యతను తిరస్కరించారు. వారిలో కొందరు ప్రజా ఉద్యమాలకు ప్రాధాన్యతనిచ్చి వాటిలో పాల్గొన్నారు. వీరిలో చాలా మంది ప్రజల ఉద్యమాలకు మద్దతునిచ్చే చిన్న చిన్న బృందాలకు చెందినవారు. అయినప్పటికి వాళ్ళు రాజకీయ పక్షాల పట్ల ముఖ్యంగా వామపక్షాల పట్ల తీవ్రమైన విమర్శనాత్మక వైఖరిని కలిగియున్నారు. మహిళా సమస్యలని మనస్ఫూర్తిగా పట్టించుకోనందుకు వారు వామపక్ష పార్టీలను విమర్శిస్తున్నారు అయితే వారు పార్లమెంటరీ వామపక్ష పార్టీలు, విప్లవ వామ పక్ష పార్టీల మధ్య ఆచరణలోగాని సాధించిన విజయాలలోగాని తేడా చూడటం లేదు. ఈ విధంగా రివిజనిస్టులను విప్లవకారులను ఒకే గాటిన కట్టటం అంటే మార్క్సిజం మీద దాడి చేయడమే.

సోషలిస్టు - ఫెమినిస్టులు మహిళా ఉద్యమం స్వతంత్రంగా ఉండాల్సిన అవసరాన్ని నొక్కి చెపుతున్నారు. స్వతంత్ర ప్రతిపత్తి అంటే రాజకీయ పార్టీల

నుండి, పురుషుల నుండి, రాజ్యం నుండి స్వతంత్రత అని అర్థం. అయితే క్రమంగా రాజకీయ పార్టీల నుండి స్వతంత్రతను నొక్కి చెబుతూ, రాజ్యంనుండి స్వతంత్రతను చెప్పటం మానివేశారు. మహిళా ఉద్యమం పార్లమెంటరీ రాజకీయాల నుండి స్వతంత్రంగా వుండటం సరైనదే. ఎందుకంటే అలా వుండటం వలన ఎన్నికల రాజకీయాలలో వుండే రాజీలకు, వైపరీత్యాలకు లోను గాకుండా వుంటుంది. కాని రాజకీయ భావజాలం నుండి అంటే మార్క్సిజం నుండి స్వతంత్రంగా వుండాలనుకోవటం వేరే విషయం. కుటుంబంలోను, రాజకీయ సంస్థలలోను వున్న పితృస్వామ్యాన్ని ఉద్యమానికి సంబంధించిన ప్రధాన అంశంగా పరిగణించాలనే ఒక బలమైన ధోరణి వున్నది. ఇలా భావించేవారు ఆ రెండింటి నిర్దిష్టమైన సామాజిక ఆర్థిక నిర్మాణాన్ని దృష్టిలో వుంచుకోవటం లేదు. మహిళల పీడనకు సంబంధించిన నిర్దిష్ట అంశాలను వ్యవస్థలోని విస్తృత వైరుధ్యాలతో అనుసంధానించటం లేదు. దీనికంతటికి కారణం వాళ్ళు వర్గదోపిడీకి మహిళలపై దోపిడికి సమాన ప్రాధాన్యతనివ్వటమే ఇది సైద్ధాంతికంగా సరైనది కాదు. దీని మూలంగా మహిళా సమస్యల పట్ల వారి దృక్పథం చరిత్రలో సంబంధం లేనిదిగా తయారైనది. సమాజాన్ని సమూలంగా మార్చటానికి అవసరమైన ఒక వ్యూహాన్ని రూపొందించుకోవటంలో కూడా ఈ ధోరణి వారికి అడ్డుతగులుతుంది. ఈ అన్యాయమైన దోపిడి స్వభావంకలిగిన వ్యవస్థను కాపాడటంలో పాలకవర్గాల చేతులలో ప్రధాన ఆయుధమైన రాజ్యానికి వ్యతిరేకంగా ఒక నిర్దిష్టమైన వైఖరిని తీసుకోకుండా ఇది నిరోధిస్తుంది.

మహిళా ఉద్యమం అందులోను ముఖ్యంగా సోషలిస్టు - ఫెమినిస్టులు ఉద్యమం సాధించిన సంస్కరణల పరిమితులను వాటి వ్యతిరేక అంశాలను గుర్తిస్తూనే వున్నారు. అయితే రాజ్యాన్ని వ్యతిరేకించటంలోను మొత్తం వ్యవస్థనంతటిని విప్లవాత్మకంగా మార్పు చేయాల్సిన అవసరాన్ని వారు నిర్దిష్టంగా గుర్తించలేకపోతున్నారు. మహిళలకు ఆర్థిక అవకాశాలు లేకపోవటం చేత మహిళా ఉద్యమం యొక్క పోరాట పటిమకు పరిమితులు ఏర్పడుతున్నాయని వారు గుర్తిస్తున్నారు. చట్టాల ద్వారా వచ్చిన సంస్కరణలు పోలీసు అధికారాలను శక్తివంతం చేశాయిగాని వారిని అదుపులో పెట్టగలిగిన విస్తృత, శక్తి ఉద్యమానికి లేదని వారు గుర్తించారు. మహిళలలో సిసలైన ప్రజాస్వామిక చైతన్యం పెరగటాన్ని రాజ్యం అంగీకరించదని, రాజస్థాన్‌లో సాథిన్స్ (Sathins) దృష్టాంతం దీన్ని రుజువు చేసిందని వారు గుర్తించారు.

అయినప్పటికి సోషలిస్టు ఫెమినిస్టులలో చాలా బృందాలకు ప్రభుత్వం నుండి, విదేశాల నుండి నిధులు అందుతూనే ఉన్నాయి ప్రభుత్వం చేత నియమించబడిన కమిటీల వంటి వాటిల్లో వారు పాల్గొంటూనే ఉంటున్నారు. స్త్రీలు స్థానిక సంస్థలలో పాల్గొనాలని వారు చురుకుగా ప్రచారం చేస్తున్నారు ఈ ధోరణిని సమర్థిస్తున్న ఒక బాధ్యత గల వ్యక్తి ఇలా అన్నారు "మనలనందరిని ఎదుర్కొంటున్న అతి ముఖ్యమయిన ప్రశ్న ప్రధాన రాజకీయ స్రవంతిలో మహిళల స్థానాన్ని ఎలా పెంచుకోవాలన్నదే నిర్దిష్టమయిన సాంఘిక, రాజకీయ ఉద్యమాలలోను న్యాయ వ్యవస్థల్లోను ప్రభుత్వము తరుపున నిర్ణయాలు తీసుకునే సంస్థల్లోను స్త్రీల ప్రాధాన్యతను ఎలా పెంచుకోవాలన్నదే". న్యాయమయిన ప్రజాస్వామికమయిన సమాజము కోసం జరిగే పోరాటాల ద్వార మహిళలను శక్తివంతులను చేసి తద్వారా సమాజాన్ని సమూలంగా మార్చటానికి అవసరమయిన స్పష్టమయిన వ్యూహం వీరికి లేదు. అందుచేతనే ప్రస్తుత వ్యవస్థలోని అవినీతికరమయిన ఎన్నికల రాజకీయాలలో పాల్గొనటం ద్వార స్త్రీలను శక్తివంతులను చేయాలని వీరు వాదిస్తున్నారు ప్రభుత్వంతో బేరసారాలాడి సంస్కరణలు సాధించుకోటానికి వీరిలో కొందరు తమ సమయాన్నంతటిని వెచ్చిస్తున్నారు. ఇవి బూర్జువా రాజకీయాలు మహా అయితే సంస్కరణ వాద రాజకీయాలుగా గుర్తించవచ్చును. వీటిద్వార స్త్రీల స్థితి గతులలో గాని సమాజములోగాని అర్థవంతమయిన మార్పులు ఏవి సాధ్యం కావు

సమాజంలో దోపిడి పీడనలకు గురి అవుతున్న ఇతరులు చేసే పోరాటాలతో మహిళా ఉద్యమాలు జతకలవాలని సోషలిస్టు ఫెమినిస్టులంటారు. అయితే విప్లవ పార్టీతో సహా ఏ రాజకీయ పార్టీతోనయిన కలిసి పనిచేయటానికి వారు సుముఖులు కారు. కేవలం ప్రజా సంఘాలతో మాత్రము తమ కార్యక్రమాలను సమన్వయం చేయాలని వారు అనుకుంటారు. వారిలో కొందరి అభిప్రాయంలో పోరాటాలతో, ప్రభుత్వంతో, కార్మిక సంఘాలతో అల్లుకు పోవలసిన అవసరం ఉంది. ఇది ఉదారవాద ఫెమినిస్టు ధోరణి వంటిదే. ఊపిరి సలపనివ్వని ఈ పీడక దోపిడీ వ్యవస్థకు వ్యతిరేకంగా జరిగే రాజకీయ పోరాటాలను ఈ ధోరణి యాదృచ్ఛికతకు వదిలివేస్తుంది. పోరాటంలో ఉండే సంఘాలమధ్య సంఘీభావం తప్పనిసరి కాని దేశంలో విప్లవాత్మక మార్పును తీసుకురావటానికి అవసరమయిన వ్యూహానికి నిర్మాణానికి ఇది ప్రత్యామ్నాయం కాదు.

నిజానికి సోషలిస్టు సమాజ స్థాపన అవసరాన్ని అంగీకరిస్తూనే ఈ ధోరణికి చెందిన ముఖ్యులు స్త్రీ సమస్యల పట్ల ప్రభుత్వ సంస్థలు మరింత చురుకుగా ఆలోచింప చేయటానికి వ్యూహాన్ని ప్రచారం చేస్తున్నారు. నిధుల కోసం మంచి మంచి జీతాలు లభించే అధికారిక ఉద్యోగాల కోసం ఫెలోషిప్పుల కోసం, ప్రభుత్వం మీద ఆధారపడటం విప్లవ అవసరాన్ని వదిలివేయటానికి ఎంతవరకు కారణం అన్నది అందరం ఆలోచించవలసిన విషయం.

**రివిజనిస్టు ధోరణి :** 1940, 1950 ల మధ్యకాలంలో జరిగిన పోరాటాల్లో పెద్ద ఎత్తున మహిళలు ముఖ్యంగా రైతాంగ మహిళలు పాల్గొన్న వారసత్వం ఫలితంగా రివిజనిస్టు పార్టీలకి ఇప్పటికి శ్రామిక మహిళలలోని ఒక వర్గంలో పునాది ఉంది. అయితే C. P. I. రాజకీయ పంథా భారతదేశంలోని పాలక బూర్జువా వర్గాన్ని అభ్యుదయకరమయినదిగా, సామ్రాజ్యవాద వ్యతిరేక మయినదిగా గుర్తిస్తుంది. అందుచేత మహిళా సమస్యల పట్ల వారి దృక్పథం ప్రభుత్వం చేత నిర్వహించబడే సంక్షేమ కార్యక్రమాల చట్టంలోనే పరిమితమై ఉంటుంది.

స్వతంత్ర ప్రతిపత్తికల మహిళా ఉద్యమ ప్రభావ ఫలితంగా రివిజనిస్టు పార్టీలు తమ మహిళా సంఘాలను తిరిగి కదిలించాయి. అవి వరకట్నం, మానభంగాలు, అనాధ స్త్రీల సమస్యల వంటి వాటిని చేపట్టాయి. ముస్లిం మహిళల బిల్లును వ్యతిరేకించాయి. శరణాలయాలను ఏర్పాటు చేయటం, కుట్టు పని తరగతులను నిర్వహించటం కొన్ని, మహిళల చేత నిర్వహించబడే లఘు పరిశ్రమలను స్థాపించటం వంటి చర్యలను కూడా వారు చేపట్టారు.

ఈ రాజకీయ పార్టీలు కాపాడుతున్న రివిజనిస్టు రాజకీయ సిద్ధాంత పంథా మహిళా ఉద్యమం పట్ల వాటి దృక్పథాన్ని కూడా ప్రభావితం చేసింది. మార్క్సిజానికి పిడివాదంతో కూడిన వ్యాఖ్యానాన్ని ఇవ్వటంతో వారు సోషలిస్టు వ్యవస్థ ఏర్పడగానే మహిళా విముక్తి దానంతట అదే సాధ్యపడుతుందని నిర్ధారించారు. ఈ విధంగా పునాదికి ఉపరితలానికి మధ్యగల సంబంధాన్ని యాంత్రికంగా వ్యాఖ్యానించటానికి సైద్ధాంతికంగాను, ఆచరణలోను తక్షణ పోరాటాల విలువ పడిపోయి నిర్లిప్తత పెరుగుతుంది. తలపోసిన సమస్యలను సృజనాత్మకంగా ఎదుర్కోవటం సాధ్యం కాదు. ఏదో ఒక విధంగా చట్టబద్ధతను పొందాలనే బూర్జువా ఫెమినిస్టు ధోరణికి అవ

కాశం కల్గుతుంది. అంతేకాక ఆర్థిక రంగంలో కాని, సాంస్కృతిక రంగంలో కాని తమ పోరాటానికి లేదా దాడికి రివిజనిస్టులు భూస్వామ్యాన్ని ఎప్పుడు కేంద్రముగా చేసుకోలేదు. అందుకనే వారు భారతదేశంలో మహిళలను పీడిస్తున్న నిర్దుష్టమయిన వ్యక్తీకరణలను, నిర్మాణాలను, ఎన్నడు ఎదుర్కొనలేదు. కుటుంబ వ్యవస్థ గురించి, దానిని ప్రజాస్వామికం చేయటానికి జరిగే పోరాటం గురించి పట్టించుకోవటానికి వారు ఎన్నడు ఇష్టపడలేదు. తమ పార్టీలలోకాని లేదా ప్రజల్ని ఆర్గనైజ్ చేయటంలో కాని సాంప్రదాయకమయిన లైంగిక శ్రమ విభజన విసిరిన సవాల్ని వారు ఎన్నడు స్వీకరించలేదు.

పశ్చిమ బెంగాల్లో నానాటికి ఎక్కువవుతున్న మానభంగాల సమస్య గురించి, మహారాష్ట్రలో DAHANU లో తమ వ్యతిరేక సంస్థకు చెందిన ఒక మహిళా కార్యకర్తపై జరిగిన మానభంగం విషయంలోను, CPM, దాని అనుబంధ మహిళా సంఘం తీసుకున్న వైఖరిలను చూస్తే పితృస్వామిక భావజాలం సంస్థాగత అవకాశవాదం ఆ పార్టీలో ఎంత పాతుకుపోయింది తెలుస్తూంది. ఆ పార్టీ సీనియర్ నాయకత్వం కూడా ఈ సమస్య పట్ల ప్రతిస్పందింవాల్సిన రీతిలో ప్రతిస్పందించకపోగా తమ కార్యకర్తలతో ఉండే స్త్రీ వ్యతిరేక పితృస్వామిక దృక్పథాన్ని సమర్థించింది. ఇంతకంటే ఘోరమేమిటంటే DAHANU (ధాహను) మానభంగం కేసులో నిందితులయిన తమ కార్యకర్తలను సానుభూతిపరులను రక్షించటం ద్వార వారు రాజకీయ, సాంఘిక విలువలు కంటే స్వల్పకాలిక సంస్థాగత ప్రయోజనాలకే ప్రాధాన్యతను ఇచ్చారు.

C.P I, C P M. లకు చెందిన మహిళా సంఘాలకు ప్రభుత్వంతో సంబంధం ఉంది. అవి ప్రభుత్వం నుండి ఆర్థిక సహాయాన్ని స్వీకరిస్తాయి. ప్రభుత్వం చేత నిర్ణయించబడే కార్యక్రమాలకు సహకరిస్తాయి. స్వతంత్ర ప్రతిపత్తి కల మహిళా సంఘాలు నష్టదాయకమనే వీరి విమర్శ. అవి ప్రభుత్వానికి దగ్గరిగా ఉన్నందుకు కాదు. అవి పార్లమెంటరీ రాజకీయ పార్టీలనుండి స్వతంత్రతను కోరుకున్నందుకే. మహిళా ఉద్యమం మీద అధిపత్యం కోసం, జాతీయ అంతర జాతీయ వేదికల్లో మహిళా ఉద్యమానికి ప్రతినిధులమని చెప్పుకోవటంలో, తమ రాజకీయ పంథాలకు అనుగుణంగా మహిళలను సమీకరించటంలో స్వతంత్ర ప్రతిపత్తి గల మహిళా సంఘాలకు రివిజనిస్టు పార్టీలకు మధ్య పోటీయే దీనికి కారణం.

ప్రస్తుత పార్లమెంటరీ చట్ర పరిధికి లోబడి పనిచేస్తున్న రివిజనిస్టు పార్టీలు తమ రాజకీయ పంథాకు అనుగుణంగా స్త్రీలను శాంతి, అధిక ధరలు వంటి పరిమిత మయిన సమస్యల మీద సమీకరించాయి. ప్రస్తుత రాజకీయ వ్యవస్థలో ఒక ప్రతి పక్షంగా ఉండే సౌకర్యాల్ని పొందటం కోసం తమ విప్లవ లక్ష్యాన్ని వదిలి పెట్టే శారు. అందుచేత విరంకుశమయిన అర్ధ భూస్వామ్య, అర్ధవలస వ్యవస్థను కూల దోయటానికి అవసరమయిన విప్లవ శక్తి వారు కోల్పోయారు. అంతేకాక తమ ఎన్నికల రాజకీయాల అవసరాలకు మహిళల ప్రయోజనాలను లోబరిచారు.

## దళిత - బ్రాహ్మణ వ్యతిరేక ధోరణి :

"దళిత" లేదా అంబేద్కర్ రాజకీయాలను విశ్వసించే వివిధ సంఘాలు, షెడ్యూలు కులాలకు చెందిన మహిళలను పెద్ద సంఖ్యలో సమీకరించాయి. ప్రారం భంలో మహిళలను, కుల అణచివేతకు, ప్రత్యేకంగా అంటరానితనానికి వ్యతి రేకంగా సమీకరించారు. ఈ కులాలకు చెందిన మహిళల జీవన స్థితిగతులు, శ్రమ శక్తిలో వారు సాధారణలగా భాగం పంచుకోవడాన్ని బట్టి, కర్మకాండ, ఉన్నత కులాల హోదాలనుండి జనించిన వివిధ రకాల భూస్వామ్య అణచివేతకు వారు గురి కాలేదని అర్థమవుతోంది. వారికి వారసత్వపు అవసరాన్ని ప్రత్యేకంగా పట్టించుకోవాల్సిన పరిస్థితి లేదు.

బ్రాహ్మణేతర రాజకీయాలు, కుల అణచివేతకు (స్త్రీల అణచివేతకు) మూలాన్ని హిందూ మతంలో చూస్తాయి. అందుచేతనే ఈ ధోరణి, హిందూ మతం మహిళల బానిసత్వాన్ని ఏ ఏ రూపాలలో సమర్థిస్తున్నదో బహిర్గతం చేయడంలో మూఢనమ్మకాల్ని, మనుస్మృతిని ఎదుర్కోవడంలో, చురుకైన పాత్ర నిర్వహిస్తున్నది. అయినప్పటికీ సమాజం పట్ల భౌతికవాద విశ్లేషణ లేకపోవడం చేత వారు పీడనకు కారణం మత సంస్కృతిలోనే వున్నదని భావించి, ఆ సంస్కృతి కుండే ఆర్థిక పునాదిని విస్మరించారు. అంతేగాక పరదా సతి శాశ్వత వైధవ్యం వరకట్నం వంటి హిందూ మతం తాలూకూ దుష్ఫలితాలు, బరువుల అగ్రకుల అగ్ర వర్గాల మహిళల మీదే పడ్డాయి కాబట్టి షెడ్యూల్డ్ కులాల మహిళలకు విముక్తి పొందాల్సిన అవసరం లేదనే ఆలోచనా ధోరణి ప్రారంభమయింది. కుటుంబ హింస, తాగుడు, భర్తలు వదిలిపెట్టడం, భూస్వాములు ఉంపుడుగత్తెలుగా వుంచుకోవటం వంటి నిర్దిష్టమైన

అణచివేత రూపాలకు, కింది కులాల మహిళలు గురి అవుతున్నప్పటికి ఈ ధోరణి దానిని ఇంకా చురుకుగా పట్టించుకోలేదు. సాంప్రదాయకంగా తనను అణచివేస్తున్న వారిని ఎదుర్కొంటున్న, పీడిత సమూహానికి తనను తాను ఆత్మ విమర్శ చేసుకోవడమనేది ఒక సంక్లిష్టమయిన ప్రక్రియ. ఇది భారతదేశంలో ఇప్పుడిప్పుడే ప్రారంభమయింది.

## షేత్‌కారీ సంఘటన ధోరణి :

షేత్‌కారీ సంఘటన మహిళా సంఘాన్ని స్థాపించటంతో పాటు, మహిళలపై జరుగుతున్న పీడనను విశ్లేషించింది. ఈ పితృస్వామిక ఆర్థిక దోపిడీ వ్యవస్థకు బాధ్యత హింసయేనని శరద్‌జోషి నొక్కి చెప్పారు. అందుకనే 1986 లో వారు నిర్వహించిన చాందువా క్యాంప్‌లో హింస భద్రతా రాహిత్యాల మీద దృష్టి కేంద్రీకరించారు. 1989 లో అమరావతి మహాసభలో మతహింస ప్రధానాంశమయింది. పురుషులకంటే మహిళలు తక్కువ అవినీతిపరులని, హింసకు వ్యతిరేకులనే అవగాహన దీనిలో అంతర్లీనంగా ఉంది. ఈ అవగాహనతోపాటు, వ్యవసాయక ఆర్థిక వ్యవస్థలో వుండే వర్గ వైరుధ్యాలను నిర్లక్ష్యం చేసే వారికుండే ధనిక రైతు విశ్లేషణ ఫలితంగా పంచాయితీలకు మొత్తంగా స్త్రీలనే ఎన్నుకుంటే గ్రామ రాజకీయాలనుండి హింసను, అవినీతిని రూపుమాపవచ్చని వారు ప్రచారం చేశారు. షేత్‌కారీ సంఘటన పంచాయితీ జిల్లా పరిషత్ రాజకీయాలలో పాల్గొనమని స్త్రీలను నిర్దేశించింది గానీ రైతాంగ పోరాటాల్లోనూ, రైతు సంఘాలలోనూ, ముందుకు తీసుకు వచ్చి, వారిని శక్తివంతులను చేయటానికి ప్రయత్నించలేదు. రైతులు తమ భూమిలో కొంత భాగాన్ని తమ భార్యల పేరిట బదిలీ చేయాలని సంఘటన ప్రచారం చేసింది. మహిళలు పరాధీనులుగా, శక్తిహీనులుగా వుండటానికి కారణం వారు ప్రజా జీవితంలో పాలుపంచుకోలేక పోవడం, ఆర్థిక వనరులపై అధికారాన్ని కలిగి లేకపోవడమేనని సంఘటన భావించింది. అయితే వ్యవసాయక ఆర్థిక వ్యవస్థను, రాజకీయాలను సంపూర్ణంగా పునర్వ్యవస్థీకరించండని పిలుపు నివ్వడానికి బదులు వారు పూర్తిగా సంస్కరణ వాద పరిష్కారాలనే ప్రచారం చేశారు.

## విప్లవ ధోరణి :

వివిధ మార్క్సిస్టు – లెనినిస్టు సంస్థలు వివిధ ప్రాంతాలలో ప్రజా బాహుళ్యంలో పునాది నేర్పాటు చేసుకోవడంలో విజయాన్ని సాధించాయి. అవి గ్రామీణ

మహిళలను ప్రత్యేకంగా పేద మహిళలను పెద్ద సంఖ్యలో సమీకరించాయి. అందు చేతనే గత దశాబ్దం నుండి ఎక్కువ మంది గ్రామీణ స్త్రీలు విప్లవ రాజకీయ చర్యల లోనూ, విప్లవ నాయకత్వంలో వర్గ పోరాటంలోనూ చురుకుగా పాల్గొంటున్నారు. భూస్వామ్య వ్యతిరేక పోరాటాలలోనూ ప్రభుత్వ శక్తులను ఎదుర్కోవడంలోనూ, మహిళల క్రియాశీలక శక్తియుక్తులను పెంపొందించడంలో విప్లవ ధోరణి విజ యాన్ని సాధించింది.

ఆంధ్ర, దండకారణ్య ప్రాంతాలలో మహిళలు సాయుధ దళాలలో చేశారు. 1969 నుండి ఇప్పటివరకు ఈ ప్రాంతంలో పోలీసు కాల్పుల్లో గాని, చిత్రహింసల్లో గాని మరణించి, 46 మంది మహిళలు అమరులయ్యారు. ఈ ఉద్యమ ఫలితంగా క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘటన వంటి నిర్దిష్ట ప్రజా సంఘాలు మహిళల కోసం ఏర్పడ్డాయి. వర్గ శత్రువులకు రాజ్యానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలోనూ, గిరిజన మహిళలను పీడించే నిర్దిష్టమైన పీడన రూపాలకు వ్యతిరేకంగానూ, జరిగే పోరాటాలలో ఈ సంఘాలు మహిళలను పెద్దఎత్తున సమీకరించాయి. మైదాన ప్రాం తాల వారు గిరిజన స్త్రీలపై జరిపే లైంగిక దోపిడీకి వ్యతిరేకంగా, కన్యాశుల్కం వంటి స్త్రీ వ్యతిరేకమైన గిరిజన సాంప్రదాయాలకు వ్యతిరేకంగా వివాహిత స్త్రీలు జాకెట్లు ధరించకూడదనే పరిమితులకు వ్యతిరేకంగా ఈ సంఘాలు జరిపిన పోరా టాలు విజయవంతమయ్యాయి. అవి మూఢ విశ్వాసాలకు వ్యతిరేకంగా ప్రచార కార్యక్రమాన్ని కూడా చేపట్టాయి.

బీహారులోకూడా గిరిజన, పేద రైతాంగ, వ్యవసాయ కూలీ కుటుంబాల మహి ళలు భూస్వామ్య వ్యతిరేక పోరాటంలో ఎంతో ఉత్సాహంతో పాల్గొన్నారు. దాని ఫలితంగా నారీముక్తి సంఘ్, నారీముక్తి సంఘర్ష్ సమితి ఏర్పడ్డాయి. ఈ సంవ త్సరం, అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా, నారీముక్తి సంఘ్ 15 వేల మంది మహిళను సమీకరించడాన్ని బట్టి ఈ విప్లవ సంస్థల పెరుగుతున్న ప్రభా వాన్ని అర్థం చేసుకోవచ్చు. ఆంధ్ర, బీహారులలో విప్లవ రైతాంగ పోరాటాలు, భూస్వామ్య, పితృస్వామిక సంప్రదాయాలకు వ్యతిరేకంగా, ముఖ్యంగా పేదవర్గాల, కులాల స్త్రీల లైంగికత్వంపైన, శ్రమపైన అనూచానంగా భూస్వాములు అనుభవిస్తున్న హక్కులకు వ్యతిరేకంగా తీవ్ర పోరాటం సలిపాయి. ఈ సంప్రదాయాలకు స్వస్తి పలకడం, శ్రామిక మహిళల గౌరవాన్ని నిలపడం ఈ ఉద్యమ విజయాలలో ఒకటి.

అంతేకాక సమాన పనికి సమాన వేతనం అనే సమస్యను కూడా చేపట్టి, ఉద్యమం బలంగా వున్నచోట్ల విజయాన్ని సాధించారు. విద్యార్థినులను సమీకరించారు. అనేక నగరాలలో పట్టణాలతో, విప్లవ నాయకత్వంలో మహిళా సంఘాలు ఏర్పడ్డాయి. లాంఛనప్రాయమైన విద్యా గంధం రాని పేద మహిళలు, గిరిజన మహిళలు పోరాట క్రమంలో నూతన నాయకత్వ స్థాయిని అందుకున్నారు. దురదృష్టవశాత్తు ఈ పోరాటాలకు, సంఘాలకు రావల్సినంత ప్రచారం లభించలేదు. ప్రచార సాధనాలకు విప్లవ రాజకీయాల పట్ల వుండే పక్షపాత వైఖరి, అఖిల భారత స్థాయిలో ఒక ఐక్య సంఘం లేకపోవడం దీనికి కారణాలు.

ప్రస్తుత భూస్వామ్య పాలనను, విదేశీ పెట్టుబడిదారులను, భారత దళారీ, బడా పెట్టుబడిదారులను కూలదోయడానికి సాగే పోరాటం, పితృస్వామ్యానికి వ్యతిరేకంగా సాగే పోరాటం, ఒకదానితో మరొకటి విడదీయరానంతగా జమిలిగా వుంటాయని విప్లవ ధోరణి అభిప్రాయం. ఎందుకంటే పితృస్వామ్యం వల్ల లాభపడేదీ, దాన్ని పెంచి పోషించేదీ ఈ శక్తులే కాబట్టి. అందుచేత మహిళా వుద్యమం భూస్వామ్య సామ్రాజ్యవాదాన్ని పాలనను కూల్చివేయడానికి సాగుతూన్న సాయుధ పోరాటంలోనూ, పితృస్వామ్యాన్ని నాశనం చేయడానికి సాగుతూన్న పోరాటంలోను భాగస్వామ్యం కావాలి. విప్లవ ధోరణి అభిప్రాయంలో, ఏటా బూర్జువా మహిళలను కలుపుకొని, పేద, భూమిలేని, రైతాంగ మహిళలు, శ్రామిక మహిళలు మహిళా వుద్యమానికి చోదక శక్తులు. మహిళలలో మెజారిటీ భాగమైన ఈ వర్గాల మహిళల దృక్కోణంనుండే మహిళా విముక్తి సమస్యను అర్థం చేసుకోవాలి. మహిళలు ఇంటి చాకిరీ సంకెళ్ళనుండి విముక్తి పొందీ, వుత్పత్తిలోనూ రాజకీయ అధికారంలోనూ, సంపూర్ణమైన, సమానమైన పాత్రను నిర్వహించినపుడు మహిళా విముక్తి సాధ్యమవుతుంది. ఈ అవగాహనకు అనుగుణంగానే కార్యక్రమాలు జరుగుతున్నాయి.

అయితే, విప్లవ ధోరణి మహిళా విముక్తిని, నూతన ప్రజాస్వామిక విప్లవంతో అనుసంధానం చేసి, ఒక సమగ్ర దృక్పథాన్ని ఈ మధ్యకాలం వరకూ రూపొందించలేదు. అంతేకాక, ఇతర దేశాల విప్లవోద్యమాలలో జరిగినట్లుగా, మన దేశంలో విప్లవ సంస్థలలో మహిళలను నాయకత్వపు స్థాయికి అభివృద్ధి చేయ

లేదు. పితృస్వామిక, భూస్వామ్య దృక్పథం బలంగా వుండటం, తొలి దశల్లో రహస్య కార్యకలాపాలను నిర్వహించడంలో ఎదుర్కొన్న కష్టాలు, ఈ లోపా నికి ఉన్న అనేక కారణాలలో కొన్ని అమలులో వున్న భూస్వామ్య వ్యవస్థను భావజాలాన్ని కూలదోయడానికి మహిళలు చురుకుగా కదిలి పోరాడినపుడే మహిళా విముక్తి సాధ్యం అవుతుంది. ఈ కర్తవ్యాన్ని విప్లవోద్యమం మాత్రమే నిర్వర్తించ గలదు. అందుచేత విప్లవోద్యమం తన బలహీనతలను అధిగమించి, జనాభాలో సగ భాగమైన స్త్రీల విముక్తి కోసం పోరాడాలి.

ముగింపు :

మహిళా వుద్యమంపై ఆధిపత్యం కోసం వివిధ రాజకీయ భావజాలాలు పోటీపడుతున్నాయని, మహిళా విముక్తి వుద్యమ సమీక్షను బట్టి తెలుస్తోంది. పీడనకు వ్యతిరేకంగా కదులుతూన్న మహిళలపై పట్టు సంపాదించటానికి సామ్రాజ్యవాద అనుకూల స్త్రీవాదం, గాంధీయవాదం, రివిజనిజం, విప్లవ మార్క్సిజం పోటీపడుతున్నాయి.

ఫెమినిజం దానంతట అదే ఒక సమగ్రమైన, నిలకడ కలిగిన భావజాలం కాదు. ఫెమినిజం అనే శబ్దాన్ని అనేక విధాలుగా వ్యాఖ్యానించవచ్చును. "ఒక పీడితవర్గంగా, మహిళలలో పెరుగుతూన్న ఆత్మ - చైతన్యాన్ని ఫెమినిజంగా చెప్పుకోవచ్చును. (గైల్ ఓమ్‌వెట్). ఈ చైతన్యానికి వివిధ రాజకీయ భావజాలాలతో సంబంధం వుంది. అందుచే మహిళా వుద్యమం రాజకీయ పార్టీల నిర్మాణ సంబంధమైన అజమాయిషీ నుండి స్వతంత్రతను కలిగి వుండగలదు గాని, రాజకీయ భావజాలంనుండి స్వతం త్రంగా వుండదు, వుండలేదు. మహిళా సమస్యలపై కలిసి పనిచేయడానికి చాలా అవకాశాలు వున్నాయి. కాని సైద్ధాంతిక ఘర్షణలు తప్పనిసరి.

ప్రస్తుతం సంస్కరణవాదం పార్లమెంటరీవాదం, మహిళా ఉద్యమం మీద ఆధిపత్యాన్ని కలిగివున్నాయి. సంస్కరణవాదంతో తెగతెంపులు చేసుకోనిదే మహిళా వుద్యమం నిశ్చలస్థితి నుండి బయటపడదు. భారత పాలక వర్గాలు, సామ్రాజ్య వాదుల సహాయంతో, మహిళా వుద్యమాన్ని నీరుకార్చివేయడానికి, దాని విప్లవ శక్తిని నిర్మూలించడానికి ప్రయత్నిస్తోంది. వర్గ పోరాటానికి, లైంగిక వివక్షతకు మధ్య చిచ్చుపెట్టి విప్లవోద్యమం నుండి మహిళా వుద్యమాన్ని వేరుపరచడానికి

వాళ్ళు ప్రయత్నిస్తున్నారు. రివిజనిస్టు పార్టీలకు వ్యతిరేకంగా జరుగుతూన్న తమ దాడిని, వారు మార్క్సిస్టు భావజాలం మీద దాడిగా మారుస్తున్నారు. విదేశీ నిధుల సహాయంతో నడుస్తూన్న ఒక స్వచ్ఛంద సంస్థ కార్యకర్త ఇలా అన్నారు: "సాంప్రదాయక మార్క్సిస్టు ధోరణి మినహా, మిగిలిన ధోరణు లన్నింటినీ (తొలినాటి రాడికల్ ఫెమినిజం, సాంస్కృతిక ఫెమినిజం, పర్యావరణ ఫెమినిజం, నియో మార్క్సిస్టు ఫెమినిజం) శక్తివంతం చేసి, మన దేశ నిర్దిష్ట పరిస్థితుల కనుగుణంగా అన్వయించుకోవాలి."

మనదేశంలో ఏ ఇతర వర్గానికి చెందిన ప్రజలకన్నా, అర్ధ వలస - అర్ధ భూస్వామ్య వ్యవస్థనుండి విముక్తి పొందవలసిన అవసరం భారత మహిళలకు ఎక్కువగా వుంది. తమకు ఉపాధి కల్పనా అవకాశాలనిచ్చే ఆర్థిక వ్యవస్థ వారికి కావాలి. వాళ్ళు పితృస్వామిక, భూస్వామ్య కుటుంబ సంబంధాలను సంస్కృతిని బద్దలు కొట్టి, దాని స్థానంలో ప్రజాస్వామిక సంస్కృతిని ప్రతిష్ఠించాలి. వాళ్ళు హీనమైన సెక్సు సంస్కృతి నుండి విముక్తి పొందాలి. రాజకీయ జీవితంలో ముందు భాగాన నిలబడే అవకాశం వారికి లభించాలి. విప్లవాత్మకమైన మార్పు ద్వారానే ఇదంతా సాధ్యం. మహిళలు విప్లవ పోరాటాలలో ముందు భాగాన నిలపడం, మహిళా విముక్తిని నూతన ప్రజాస్వామిక విప్లవ లక్ష్యంగా చేయడం, నడుస్తున్న మహిళా వుద్యమాలలో పాల్గొని వాటిని రాజ్య వ్యతిరేక వుద్యమాలుగా మలచడం, మహిళా సమస్యల పట్ల అభివృద్ధి చెందుతూన్న సిద్ధాంతాలను స్వీకరించడం ద్వారా మార్క్సిజాన్ని మరింత అభివృద్ధి పరచడం, పీడిత ప్రజలకే కాక, విముక్తి కోసం పోరాడుతూన్న పీడిత మహిళలకు చోదక శక్తిగా పని చేయడం - ఇవీ విప్లవోద్యమం ఎదుర్కొంటున్న సవాళ్ళు. మహిళలకు విప్లవం అవసరం. విప్లవానికి మహిళలు అవసరం.

- అనూరాధ ఘాంది

[అనువాదం : C S R ప్రసాద్]



అక్టోబరు 16, 17 తేదీలలో కర్నూలులో జరుగవలసిన కథల వర్క్‌షాప్ వాయిదా పడింది. ఎప్పుడు జరిపేదీ మళ్ళీ అరుణతారలో తెలియజేస్తాము.

— విరసం

కర్నూలు యూనిట్

# మతోన్మాదాన్ని మట్టుబెట్టండని పిలుపు నిచ్చిన అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితి దశాబ్ది ఉత్సవాలు

విప్లవ నినాదాలు, అరుణ పతాకాల రెపరెపలు, ఎర్రని తోరణాలు, ఉత్తేజ పూరిత వాతావరణం మధ్య అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితి (AILRC) దశాబ్ది ఉత్సవాలు అక్టోబర్ 9 ఉదయం సరోజ్‌దత్తా నగర్ (రాణాప్రతాప్ ఫంక్షన్ హాల్, హైద్రాబాద్)లో ప్రారంభమయ్యాయి. ప్రధాన ద్వారం వద్ద సరోజ్‌దత్తా, సుబ్బారావు పాణిగ్రాహిల చిత్రాలు, దప్పుపై సుత్తి, కొడవలి, కలం ఉన్న ఎ. ఐ. ఎల్ ఆర్. సి. చిహ్నం విప్లవ స్ఫూర్తిని కలిగించేవిగా ఉన్నాయి. వర్షాన్ని సైతం లెక్కచేయకుండా దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి కవులు, కళాకారులు, రచయితలు, మేధావులు, శ్రామికులు రెండువేలకు పైగా ప్రతినిధులు హాజరయ్యారు. విప్లవం వర్థిల్లాలి, నూతన ప్రజాస్వామిక సంస్కృతి వర్థిల్లాలి, మతతత్వం నశించాలి, ప్రజా కళలు వర్థిల్లాలి మొదలైన నినాదాల మధ్య ఎర్రజెండాను రైతుకూలీ సంఘం నాయకుడు గోద మాధవరావు, ఏ ఐ. ఎల్. ఆర్. సి. పతాకాన్ని ప్రధాన కార్యదర్శి కె. వి. ఆర్., విరసం పతాకాన్ని విరసం కార్యదర్శి వి. చెంచయ్య ఆవిష్కరించారు. "సుత్తి కొడవలి గుర్తుగ ఉన్న ఎర్రని జెండా ఎగురుతున్నది", "కమ్యూనిస్టులం మేం కష్టజీవులం" తదితర పాటలను జననాట్యమండలి తదితర సాంస్కృతిక సంస్థల కళాకారులు ఉత్తేజపూరితంగా పాడారు. నూతన కమ్యూన్‌లో శంకర్ ఆర్ట్ ఎగ్జిబిషన్, ఎం. ఎస్. ఆర్. లైబ్రరీ ఆకర్షణీయంగా, ఆలోచనాత్మకంగా ఉన్నాయి. విప్లవోద్యమంలో పనిచేస్తూ పోలీసు కాల్పుల్లో అమరుడైన విప్లవకవి సముద్రుడు హాల్‌లో సభలు ప్రారంభమయ్యాయి.

ఈ దశాబ్ది ఉత్సవాలకు అనేక సంస్థలు, కళాకారులు, మేధావులు తమ సందేశాల్ని పంపారు. ప్రజల కోసం పోరాడే వారిపై ప్రభుత్వాలు ఎప్పుడూ నిర్బంధాన్ని అమలుచేస్తూనే ఉంటాయని, వాటికి భయపడకుండా రచయితలు, కళాకారులు, మేధావులు ప్రజల పక్షమే నిలవాలని దండకారణ్య రచయితలు సందేశాన్ని పంపించారు.

సుబ్బారావు పాణిగ్రాహి, చెరబండరాజులతో సహా నమ్మిన ఆశయాలకోసం అమూల్య మైన ప్రాణాలు త్యాగం చేసి ఆదర్శమూర్తులుగా అమరులైన వారి బాటలో ముందుకు సాగుతామని పేర్కొన్నారు జస్టిస్ చిన్నపరెడ్డి, కాశ్మీర్ యూనివర్శిటీ మాజీ వైస్ ఛాన్సలర్ మంజూర్ ఆలమ్, షబనా ఆజ్మీ, నదీరా బబ్బర్, అనంద్ పట్వర్ధన్, మరాఠీ కవి దయాపవార్, పీపుల్స్ ఆర్ట్ అండ్ లిటరరీ అసోసియేషన్, ఉద్యోగ క్రాంతి, ఎ. పి. టి ఎఫ్, జనసాహితి, అరుణోదయ, దళిత రచయితల కళాకారుల మేధావుల ఐక్య వేదిక, వికల్ప (ఢిల్లీ) తదితర వ్యక్తుల నుండి, సంస్థల నుండి సందేశాలు వచ్చాయి.

ప్రారంభ సమావేశానికి అధ్యక్షత వహించిన విరసం కార్యవర్గ సభ్యుడు కా॥ నారాయణస్వామి AILRC నీ, దాని లక్ష్యాన్నీ, ప్రస్తుత సభల ప్రాధాన్యాన్ని వివరించారు ఆహ్వాన సంఘాధ్యక్షురాలు, ప్రముఖ ఉర్దూ రచయిత్రి జిలానిబాను స్వాగతోపన్యాసం చేశారు. AILRC కార్యదర్శి కా॥ కె. వి. ఆర్. కార్యదర్శి నివేదికను చదివారు. ప్రముఖ ఆర్థికవేత్త, కలకత్తాలోని సామాజిక శాస్త్రాల అధ్యయన కేంద్రం డైరెక్టర్ ప్రొ॥ అమియకుమార్ బాగ్చీ ప్రారంభోపన్యాసం చేస్తూ బహుముఖాలుగా విస్తరిస్తున్న మతతత్వాన్ని నిర్మూలించడానికి కళాకారులు, రచయితలు, మేధావులు శాయశక్తులా పాటు పడాలని పిలుపునిచ్చారు. మతతత్వ వైరస్ వ్యాప్తిని ఎదుర్కోవడానికి దేశవ్యాప్తంగా ప్రతిఘటన దళాలను ఏర్పాటు చేయాలని సూచించారు. రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోడానికి మతతత్వాన్ని ఒక సాధనంగా వాడుకొంటూ కొన్ని శక్తులు మతోన్మాదాన్ని పెంచి పోషించా యన్నారు. భారతదేశంలోని గ్రామీణ ప్రాంతాల్లో హిందూ ముస్లింల మధ్య కొంత కాలం క్రితం వరకు చక్కటి సామరస్యం, సత్సంబంధాలు ఉన్నాయని, బెంగా ల్లో దుర్గా పూజను, మొహరం పండుగను హిందూ ముస్లిం ప్రజలు కలిసి చేసు కుంటారని, మతతత్వం అనేది విద్యావంతులయిన, అగ్ర వర్గాలకు చెందిన, పట్టణ ప్రాంత వాసుల్లోనే జనిస్తుందని ఆయన వివరించారు. యువతరంలో పెరిగిపోతున్న నిరుద్యోగం, నిరక్షరాస్యత, దారిద్ర్యం మూలంగా మతతత్వం బలపడే వాతావరణం ఏర్పడిందని విశ్లేషించారు.

ఆరోజు మధ్యాన్నం సెషన్‌లో ప్రజాసంస్కృతిపై విప్లవోద్యమాల ప్రభావం గురించి జననాట్యమండలి కళాకారుడు గద్దర్, మహారాష్ట్ర కళాకారుడు శంభాజీ

భగత్, తమిళనాడు కళాకారులు ప్రసంగించారు. నాటి రాజుల కాలం నుంచి నేటి వరకు ప్రజాసాహిత్యాన్ని పాలకులు ప్రబలనీయకుండా అడ్డదారులను అనుసరిస్తున్నారని, కవులు, రచయితలు రాజ్యానికి లోబడి వ్యవహరించకపోవటం నేరంగా భావించడం పరిపాటి అయినప్పటికీ ఆత్మనిగ్రహంతో, ప్రజల అండదండలతో భవిష్యత్తరాల కోసం రచనలు గావించడం సంతోషకరమనీ అన్నారు.

10 వ తేదీ ఉదయం పౌరహక్కుల సంఘ కార్యదర్శి డా॥ బాలగోపాల్ మాట్లాడుతూ మార్క్స్ ప్రతిపాదించిన చారిత్రక భౌతికవాదాన్ని సృజనాత్మకంగా అన్వయించుకుంచే ప్రస్తుత పరిస్థితులకూ వర్తిస్తుందని అన్నారు. హిందూమతం బోధించే ధర్మం, సామాజిక ఆర్థిక సాంఘిక నిర్మాణాన్ని తన చెప్పు చేతల్లోకి తీసుకోవడానికి ఉద్దేశించిందని ఆయన అన్నారు. దేశంలో వున్న పేదలందరికీ ఇళ్ళు నిర్మించాకే మసీదూ, మందిరమూ నిర్మిస్తామని ఇరువర్గాలూ ప్రతిన బూనాలని ఆయన సూచించారు.

అనంతరం 'మతతత్వ మూలాలు' అనే అంశంపై ప్రముఖ మహారాష్ట్ర కళాకారుడు డా॥ శ్రీరాంలాగూ మాట్లాడుతూ నేడు దేశంలో కొన్ని స్వార్థ రాజకీయ శక్తులు ఒక వర్గం మైనారిటీ ప్రజలను దేశంనుంచి వెళ్ళగొట్టడానికి ప్రయత్నిస్తున్నాయని, దీనివల్ల అనాదిగా పరమత సహనమే పరమావధిగా కొనసాగుతూ వస్తున్న భారతీయ సంస్కృతిని చేజేతులా నాశనం చేసుకున్న వారమవుతామని హెచ్చరించారు అన్ని మతాలవారి సమష్టి కృషి, త్యాగాల ఫలితమే నేటి స్వాతంత్ర్యం అనీ, దీన్ని మతోన్మాదులు గుర్తుంచుకోవాలనీ అన్నారు.

సాయంత్రం 4 గంటల నుండి 7 గంటలవరకు రాజాప్రతాప్ ఫంక్షన్ హాలు నుంచి పాతబస్తీలోని మొగల్‌పురా ఏరియా వరకు బ్రహ్మాండమైన ఊరేగింపు జరిగింది. ఊరేగింపు అగ్రభాగాన ఏ.ఐ.ఎల్.ఆర్.సి. నూతన కార్యదర్శి కా॥ వరవరరావు, కార్యవర్గ సభ్యులు కా॥ చలసాని ప్రసాద్, కా॥ C.S.R. ప్రసాద్. కా॥ వి. చెంచయ్యలు బ్యానర్లు పట్టుకొని రాగా, ఆ వెనుక సాంస్కృతిక కళాకారులు ప్రదర్శన లిస్తూ వచ్చారు. మూడుగంటల సేపు ఊరేగింపు ఉత్తేజకరంగా సాగింది.

మొగల్‌పురా మగ్దుంనగర్ (ప్లేగ్రౌండ్స్)లో జరిగిన బహిరంగసభకు ఏ.ఐ.ఎల్.ఆర్.సి. నూతన కార్యదర్శి కా॥ వరవరరావు అధ్యక్షత వహించారు.

ఆయన మాట్లాడుతూ డిసెంబర్ 6 ను హిందూత్వ వ్యతిరేక దినంగా పాటించాలని పిలుపు నిచ్చారు. కాళోజీ మాట్లాడుతూ మతోన్మాదానికి వ్యతిరేకంగా జరుగుతున్న ఉద్యమంలో మేధావులు కలిసిరావాలని అన్నారు. పాలకులే మతోన్మాదాన్ని పెంచి పోషిస్తున్నారని, అసమానతలు, దోపిడి పీడనలు ఉన్నంతవరకు విప్లవాలు పుడుతూనే ఉంటాయని కన్నాబిరాన్ అన్నారు. దండకారణ్యంలో ప్రజాస్వామ్య పోరాటం చేసే వారు మతతత్వాన్ని ఇక సహించరని ఎం.టి. ఖాన్ అన్నారు. ప్రముఖ నటుడు శ్రీరాంలాగూ మాట్లాడుతూ అయోధ్యలో మసీదును బలవంతంగా నిర్మించాల్సిన అవసరం లేదనీ, హిందువులంతా మసీదు కూల్చివేతను అవమానంగా భావించినట్లయితే మసీదు నిర్మాణం దానంతటదే జరుగుతుందని అన్నారు. ఇంకా అనురాధ గాంధీ తదితరులు ప్రసంగించారు. మహారాష్ట్రకు చెందిన శంభాజీ భగత్ ఆధ్వర్యంలో ఆలపించిన పాటలు సభికులను విశేషంగా ఆకర్షించాయి. ప్రజా గాయకుడు గద్దర్ తన బృందంతో మతోన్మాద శక్తులపై తీవ్రస్థాయిలో ధ్వజమెత్తి ఆలపించగా భగత్ ఆ పాటలను హిందీలో పాడారు. బెంగాల్‌కు చెందిన అమోల్ తాలూక్‌దార్, దీనాముఖర్జీ బృందం కూడా సాంస్కృతిక ప్రదర్శనలిచ్చారు. బహిరంగసభ ఆవరణలో భారీ సంఖ్యలో పోలీసులు కనిపించారు.

మొత్తంమీద మతతత్వ ప్రతిఘటనా సభలుగా ఏ.ఐ.ఎల్.ఆర్.సి. దశాబ్ది ఉత్సవాలు జరిగాయి.

---

## 5 వ మహాసభల సందర్భంగా అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమాఖ్య 11-10-93న చేసిన తీర్మానాలు

1. మహారాష్ట్ర భూకంప బాధితుల పట్ల రాష్ట్ర ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరినీ, పోలీసుల అమానుష చర్యల్ని నిరసిస్తూ—
2. డిసెంబర్ 6ను హిందూత్వ వ్యతిరేక దినంగా పాటించాలని ప్రజాపీకానికి పిలుపు నిస్తూ—
3. రష్యా పరిణామాల నుండి గుణపాఠాలు తీసుకుని, రివిజనిజానికీ, సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా పోరాడాలని ప్రకటిస్తూ—
4. ప్రజాస్వామిక శక్తులపైన హిందూ మతోన్మాదుల దాడులను ఖండిస్తూ—
5. ఆంధ్రప్రదేశ్‌లో ఉద్యమిస్తున్న ప్రజానీకంపై బి. యస్. యఫ్, పారా మిల టరీ, సైన్యాల దారుణ నిర్బంధాన్ని వ్యతిరేకిస్తూ—
6. బీహార్‌లో రైతాంగ పోరాటాలపైన ఫాసిస్టు దాడిని ఖండిస్తూ—
7. సూరత్‌లో మతకల్లోలాన్ని రెచ్చగొడుతున్న బి.జె.పి. వైఖరిని తీవ్రంగా పరిగణిస్తూ—
8. హౌరా జిల్లాలోని గ్రామీణ ప్రజలపైన సి.పి.యం. గూండాల దాడుల్ని ఖండిస్తూ—
9. భిలాయ్ ప్రాంతంలో లఘు, భారీ పరిశ్రమలలోని కార్మికవర్గం కార్మిక చట్టాల అమలుకై చేస్తున్న పోరాటాన్ని సమర్థిస్తూ—
10. మహారాష్ట్రలోని మేల్‌ఘాట్ ప్రాంతంలో ఇటీవల 2 నెలల కాలంలోనే 500 మంది పిల్లలు ఆకలి చావులకు గురికావడం, 1500 మంది పిల్లలు చావుకు దగ్గరలో దయనీయ పరిస్థితిలో ఉండడంపై ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరిని నిరసిస్తూ—
11. బంగ్లాదేశ్‌లోని మైనారిటీ హిందువులపై ముస్లిం మతోన్మాదుల దాడులను వివరిస్తూ 'లజ్జా' అనే నవల రాసిన తస్లిమా నస్రీన్‌కు ముస్లిం మతఛాందస వాదులు మరణశిక్ష విధించడాన్ని ఖండిస్తూ—

12. బాబ్రీమసీదు స్థానంలో రామాలయాన్ని నిర్మించడానికి మతసంస్థల అధిపతులతో ఒక ట్రస్టును కేంద్ర ప్రభుత్వం నియమించడాన్ని వ్యతిరేకిస్తూ, బాబ్రీ మసీదును అదే స్థలంలో పునర్నిర్మించాలని డిమాండ్ చేస్తూ—

13. సంస్కృత విశ్వవిద్యాలయాల స్థాపననూ, వాటికి శంకరాచార్య పీఠాధిపతుల్ని డీన్‌లుగా చెయ్యడాన్ని ఖండిస్తూ—

అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమాఖ్య జనరల్‌బాడీ తీర్మానాలు చేసింది.



## కూటాలమర్రి సాక్షిగా

కూతవేటు దూరంలో కూటాలమర్రి నెట్టుకొని
కూటికాడ కూకుంటె కండ్లనిండా నీరాయే
ప్రతి మెతుకులో మీరు సాయుధులై పలకరించితిరి
కూటాలమర్రిలో వాడి క్రౌర్యాన్ని చవిచూసినా—
నక్సల్బరి ప్రభంజనం దండకారణ్యాన్ని దాటి
తూర్పు కనుమల్లో దండోరా మోగిస్తూ
ఆరావళి దాటి కన్యాకుమారి దాకా విస్తరిస్తుంటే
పాలకవర్గాల గుండెల్లో వేనవేల మందుపాతరలు పేలుతున్నాయి
లక్షలాది నక్షత్రాలు రాలనిదే
ఉజ్వల భవిష్యత్తు ప్రకాశించదనే విప్లవ సూత్రాన్ని గుర్తుచేస్తూ
మీరు విలిపిన అత్యున్నత విప్లవ సాంప్రదాయాలను
మాకందించిన వారసత్వంగా
మీరు ఆగిన చోటనుండే మొదలవుతున్నాం మేం
మరణశయ్య మీదనుండి వాడి గాండ్రింపులన్నీ
కాగితం పులి ఆరుపులేనని నిరూపిస్తాం

—వెంకట్



# AILRC సభల సందర్భంగా 12-10-93 న హైద్రాబాద్‌లో జరిగిన విరసం కార్యవర్గం చేసిన తీర్మానాలు

## 1. అనలే ప్రకృతి వైపరీత్యం, ఆపైన పోలీసుల అమానుషత్వం.

మహారాష్ట్రలోని లాతూర్, ఉస్మానాబాద్ జిల్లాలను కుదిపివేసిన భయంకర భూకంపంవల్ల ఎందరో మరణించారు, ఎందరో గాయపడ్డారు, మరెందరో నిరాశ్రయులయ్యారు. ఒకవైపు ఇంత దారుణమైన పరిస్థితి ఉంటే మరోవైపు సహాయ కార్యక్రమాలను క్రమబద్ధీకరించాల్సిన రాష్ట్ర పోలీసులు భూకంపబాధితులపట్ల అమానుషంగా ప్రవర్తించడం మరీ దారుణం. రాష్ట్ర ప్రభుత్వ యంత్రాంగం, మరీ ముఖ్యంగా పోలీసులు బాధితుల కోసం కేటాయించబడ్డ డబ్బును, వస్త్రాల్ని, ఆహార పదార్థాల్ని, పాలనీ అక్రమంగా సంగ్రహించే నీచస్థితికి వెళ్ళిపోయారు. మరాఠ్వాడా, పశ్చిమ కనుమల ప్రాంతాల్లో భూమిలోపలి పొరలు ప్రమాద కారకాలుగా ఉన్నాయని ప్రముఖ ఇంజనీర్ కె.ఎల్. రావు హెచ్చరికలు చేసినా ప్రభుత్వం అక్కడ భారీ నిర్మాణాలకు అనుమతి యివ్వడం, పెద్ద పెద్ద ప్రాజెక్టులు నిర్మించడం, రిజర్వాయర్లను పూర్తిగా నీటితో నింపడం వంటి చర్యల మూలంగానే ఇంత తీవ్ర స్థాయిలో భూకంపం రావడానికి అవకాశం కలిగింది. కాబట్టి పాలకవర్గాల ప్రజా వ్యతిరేక "అభివృద్ధి" కార్యక్రమాలే భయంకర ప్రకృతి వైపరీత్యాలకు ప్రధాన కారణాలుగా కనిపిస్తాయి విప్లవ రచయితల సంఘం భూకంప బాధితులకు ప్రగాఢ సానుభూతిని ప్రకటిస్తోంది. ప్రకృతి వైపరీత్యాలను పెంచేవిధంగా పాలకవర్గాల ప్రజా వ్యతిరేక చర్యల్ని విరసిస్తోంది. భూకంపబాధితుల పునరావాసం, తదితర సహాయ కార్యక్రమాల్ని యుద్ధ ప్రాతిపదికగా చేపట్టాలని డిమాండ్ చేస్తోంది. అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమాఖ్య వేసిన కాళోజీ నాయకత్వంలోని భూకంప బాధితుల సహాయ కమిటీకి విరివిగా విరాళాలందించాలని ప్రజానీకానికి విజ్ఞప్తి చేస్తోంది.

## 2. డిసెంబర్ 6ను హిందూత్వ వ్యతిరేక దినంగా, మైనారిటీల హక్కుల పరిరక్షణ దినంగా పాటించండి.

ప్రసిద్ధ చారిత్రక కట్టడమూ, మైనారిటీలయిన ముస్లింల ప్రార్థనా స్థలమూ అయిన బాబ్రీమసీదును హిందూ మతోన్మాదుల నుండి రక్షించుకోలేక పోవడం

బాధాకరమైన విషయం 92 డిసెంబర్ 6 భారతదేశాన్ని సిగ్గుతో, అవమానంతో తలవంచుకోవలసిన దుస్థితికి నెట్టివేసింది. కాబట్టి డిసెంబర్ 6ను హిందూత్వ వ్యతిరేక దినంగా, మైనారిటీల హక్కుల పరిరక్షణ దినంగా పాటించాలని భారత ప్రజానీకానికి విరసం విజ్ఞప్తి చేస్తోంది. బాబ్రీమసీదును అదే స్థలంలో పునర్నిర్మించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తోంది. బాబ్రీమసీదు స్థలంలోనే రామాలయాన్ని నిర్మించడానికి హిందూమత సంస్థల నాయకులతో ఒక ట్రస్టును ఏర్పాటు చేస్తున్న కేంద్ర ప్రభుత్వ మైనారిటీ వ్యతిరేక వైఖరిని విరసం ఖండిస్తోంది.

## 3. మైనారిటీలపై, ప్రజాస్వామ్య శక్తులపై హిందూ మతోన్మాదుల దాడిని తిప్పికొట్టండి.

నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాలతో దేశ ఆర్థిక స్థితిని పాతాళానికి నెట్టివేసిన భారత పాలకవర్గాలు ప్రజల దృష్టిని మళ్ళించడానికి మతోన్మాద శక్తుల్ని రెచ్చగొడుతున్నాయి. శివసేన, భజరంగదళ్‌లు మైనారిటీలపైనా, ప్రజాస్వామ్య శక్తులపైనా, వ్యక్తులపైనా దాడులు చేస్తున్నాయి. బొంబాయినుంచి వెలువడుతున్న సాయంకాల దినపత్రిక "మహానగర్" సంపాదకుడు నిఖిల్‌వాగ్లేపై శివసేన దాడులు, సహమత్ ఎగ్జిబిషన్‌పైన భజరంగదళ్ దాడులు ఇందుకు తాజా నిదర్శనాలు. ఈ రెండు సంఘటనలలోను కేంద్ర, రాష్ట్ర కాంగ్రెస్ పాలకులు ఈ ఫాసిస్టు మూకలతో చేతులు కలిపాయి. ఎల్.కె. అద్వానీ రథయాత్రనాటి పరిస్థితిని "రామ్ కే నామ్ సే" అనే పేరులో ఒక డాక్యుమెంటరీ ఫిల్మ్‌గా తీసిన ఆనంద్ పట్వర్ధన్‌పై శివసేన దాడులు, బెదిరింపులు వారి ఉన్మాదస్థితిని తెలియజేస్తున్నాయి. ఈ మతోన్మాదుల దాడులకు వ్యతిరేకంగా సెక్యులర్, ప్రజాస్వామిక శక్తులన్నీ ఐక్యం కావాలని విరసం పిలుపునిస్తోంది.

## 4. తస్లీమానస్రీన్‌కు ముస్లిం ఛాందసవాదులు విధించిన మరణ శిక్షను వ్యతిరేకించండి.

తస్లీమానస్రీన్ బంగ్లాదేశ్‌లో ప్రముఖ రచయిత్రి. బాబ్రీమసీదు విధ్వంసం తర్వాత బంగ్లాదేశ్‌లో హిందూ మైనారిటీలపైన ముస్లిం మతోన్మాదుల దాడులు ప్రారంభమయ్యాయి. ముస్లిం మత ఛాందసవాదానికి గురైన ఒక హిందూ కుటుంబ

దీనగాథను వర్ణిస్తూ తస్లిమానస్రీన్ "లజ్జా" (సిగ్గు) అనే పేరుతో ఒక నవల రాశారు. ఈ నవలలో ముస్లిం మతోన్మాదులు ముల్లాల ఫాసిస్టు ధోరణిని తీవ్రంగా నిరసించారు. దీన్ని ప్రజాస్వామికంగా ఎదుర్కోలేని ముల్లాలు తస్లిమానస్రీన్‌కు మరణశిక్ష విధించారు. ఆమెను చంపినవారికి 50,000 రూపాయల బహుమతి ప్రకటించారు. గతంలో ఖొమైనీ సాల్మన్‌రష్దీపై కూడా ఇలాంటి శిక్షనే విధించాడు. ప్రజాస్వామిక రచయితలపై మతోన్మాదులు విధించే ఈ మరణశిక్షల్ని విరసం తీవ్రంగా ఖండిస్తోంది. పైగా తస్లిమానస్రీన్ సాల్మన్‌రష్దీకి ఆధ్యాత్మిక భార్య అని ప్రచారం చెయ్యడాన్ని విరసం తీవ్రంగా నిరసిస్తోంది. సాల్మన్‌రష్దీలాగా మతోన్మాదులకు భయపడి క్షమాపణలు చెప్పుకొనే ప్రసక్తే లేదని ప్రకటించిన తస్లిమానస్రీన్‌కు విరసం జేజేలు పలుకుతోంది.

**5. సంస్కృత, వైదిక విశ్వవిద్యాలయాల స్థాపనను ఖండించండి.**

కేరళలోని కలాడిలో స్థాపించనున్న సంస్కృత విశ్వవిద్యాలయానికి శృంగేరి శంకరాచార్యుల్ని అధిపతిగా చెయ్యాలన్న కేరళ ప్రభుత్వ వైఖరిని, తమిళనాడు కాంచీపురంలోని సంస్కృత విశ్వవిద్యాలయానికి నిధులు సమకూర్చాలని ఆలోచిస్తున్న కేంద్ర ప్రభుత్వ ధోరణిని విరసం ఖండిస్తోంది. సంస్కృతం నేరుగా వైదిక మతంతో ముడిపడివున్న భాష. ఇది పండితభాష, కృత్రిమంగా అభివృద్ధి చెందింపబడ్డ భాష. పైగా కోట్లాది ప్రజల మాతృభాషలే దేశ భాష స్థాయికి ఎదగని స్థితిలో ఎవ్వరికీ మాతృభాషగాని సంస్కృతాన్ని ఇలా ప్రచారం చెయ్యడాన్ని విరసం వ్యతిరేకిస్తోంది.



# లేఖలు

అరుణతార ఎడిటర్‌కు,

ఫిబ్రవరి 1993 (144) అరుణతారలో మీరు ప్రచురించిన 'పెద్దకొడుకు' కథ గురించి నా అభిప్రాయం రాస్తున్నా. కథ గురించి రాసేముందు మరో విషయం - మీ పాఠకుల్లో ఇంగ్లీషు రానివాళ్ళు కూడా ఉన్నారు. కాబట్టి ఇంగ్లీషు వాడినప్పుడల్లా తెలుగు అనువాదం పక్కనే ఇస్తే బాగుంటుంది. SLR, CRPF వంటి అక్షరాలు తెలుగులోనే రాస్తే బాగుంటుంది. పాట్నా సెమినార్ ప్రోగ్రాం ఇంగ్లీషులో మాత్రం వుంది. మరి (మీరు గర్వించదగిన) అటువంటి పాఠకులు ఎలా తెల్సుకోవాలి దాని గురించి! ఇక కథ గురించి—

మన సమాజంలో మామూలుగా వాడే పదాలనూ, భావాలనూ లేదా ఈ సమాజంలో ఒక అర్థంలో వాడే విషయాల్ని కళాకారులు మార్చడం ద్వారా (విప్లవీకరించడం అనొచ్చా?) వాటికి కొత్త అర్థాల్ని కల్పిస్తూ వుంటారు. అవి ఒకోసారి ఎంతో కొత్తగా ఉండి, పాఠకులూ, ప్రేక్షకులూ విషయాల్ని కొత్త వెలుగులో చూసేట్లుగా చేస్తాయి అయితే అలా మనం దేన్నైనా మార్చాలనుకున్నప్పుడు అసలా భావం మార్పుకు గురయ్యేదేనా, అంటే విప్లవీకరించదగిందేనా? లేదా? అనేది చూడడం చాలా అవసరం. ఇదే కథ నుంచి రెండు ఉదాహరణలు తీసుకుంటాను. రెండూ అమ్మకి విషయాల్ని కొత్త అర్థంలో అర్థం చేయించడానికి రవి చేసిన ప్రయత్నాలే.

1. "…. నేను ఇంజనీరునై ప్రజలకు సేవ చెయ్యాలంటే, మొదట ఈ దేశం వాళ్ళది కావాలి. దోపిడీ లేని సమాజం కావాలి. అందుకే బిల్డింగ్‌లు కట్టే ఇంజనీరుగా కాక, ఒక మంచి సమాజాన్ని నిర్మించే ఇంజనీరుగా మారాను."

2. …. అమ్మా! నిజం చెప్పాలంటే ఈ రోజు దేశం కూడా భర్త చనిపోయి, పెద్దకొడుకు అండలేని తల్లిలాగానే ఉంది తనను ఆదుకునే వాళ్ళకోసం, ఆతృతగా పిలుస్తున్నది. నీలాంటి తల్లులు పంపే కొడుకులే మాతృభూమిని రక్షించే పెద్దకొడుకులు కావాలి. నేనూ అటువంటి పెద్దకొడుకునే కదమ్మా."

మొదటి విషయంలో ఇంజనీరు అనే వృత్తే (వ్యక్తే) దోపిడి సమాజానికి సంబంధించింది కాదు ఇంజనీర్లు నిర్మాణం చేస్తారు. కానీ ఈ సమాజంలో కోటీశ్వరుల కోసం ఆ నిర్మాణం జరుగుతోంది. కనకా అసలా కోటీశ్వరుల నిర్మాణాన్నే మారుస్తానంటాడు ఈ విప్లవకారుడు. ప్రజలకోసం నిర్మాణం చేస్తాననడమే కాక కొత్త సమాజాన్ని నిర్మాణం చేయడం' అనే ఒక కొత్త అర్థాన్ని ఇంజనీరు అనే

పదానికివ్వడం ద్వారా కథలోని తల్లి పాత్రకి, చదివే పాఠకులకి కూడా విషయాల్ని కొత్తకోణంలో చూపడానికి ప్రయత్నించారు రచయిత. ఈ పద్ధతి చాలా ప్రభావం చూపగల్గుతుంది.

కానీ రెండో విషయానికొస్తే 'పెద్దకొడుకు' (బాధ్యతలు నిర్వర్తించాలనే అతనికి ప్రాముఖ్యత ఇవ్వాలి) అనే భావన ఒకానొక చారిత్రక క్రమంలో పుట్టు కొచ్చినది. దాని పుట్టుక స్వంత ఆస్తి పునాదిగా కల భూస్వామ్య వ్యవస్థలో. అదొక భూస్వామ్య సమాజ భౌతిక పరిస్థితి. దాని నుండి పుట్టిన భావం, ఇంజనీరు అనే పదానికి కొత్త అర్థాన్ని ఇవ్వగల్గినట్లుగా 'పెద్దకొడుకు' అనే భావానికి (ఈ భావం కొత్తకోణాన్ని పాఠకులకివ్వకపోగా అనేక ప్రశ్నల్ని మాత్రం లేవనెత్తుతుంది. అవన్నీ ఇక్కడ రాయకపోయినా పెద్దకొడుకు అనే భావంతో మన సమాజంలో జరిగే వాటినన్నింటినీ ఒక్కసారి ఆలోచిస్తే తెలుస్తుంది) కొత్త అర్థాన్ని ఇవ్వడం అందుకే సాధ్యంకాదు. ఆ భావం భూస్వామ్య వ్యవస్థ నాశనంతో పోవాల్సిందే తప్ప మార్పుకైతే లొంగదు. దాన్ని ఎన్ని విధాలుగా చేసినా విప్లవీకరించడం అసాధ్యం - అది భూస్వామ్య భావజాలంగానే మిగిలిపోతుంది. ఈ కథలో అదే జరి గింది. ఆ భావం స్వభావమే భూస్వామ్యం కాబట్టి భారతదేశాన్ని వర్ణించిన తీరూ దాన్నే అనుసరించింది. విప్లవకారులను 'భర్తలేని, పెద్దకొడుకు అండలేని దేశాన్ని ఆదుకునే వారుగా' మార్చివేసింది. ఇంకా స్పష్టంగా చెప్పడానికి మరో ఉదాహరణ ఇస్తాను. పసుపు, కుంకుమలు అనే భావం వుంది. దాన్ని మనం ఎంతగా, ఎన్ని రకాలుగా మార్చి పాటల్లో రాసినా అసలా భావమే భూస్వామ్య సమాజానికి సంబం ధించింది కాబట్టి అది అలానే మిగిలిపోతుంది. వీటికి పునాదిగా ఉన్న భూస్వామ్య వ్యవస్థతోపాటూ ఇవి నాశనం కావాల్సిందే తప్ప విప్లవీకరించడం సాధ్యంకాదు. నిజానికి ఈ పని చేయడానికి బూర్జువా ప్రజాస్వామిక విప్లవాలు (సక్రమంగా జరి గితే) చాలు. మనందరికి తెలిసినట్లే ఇప్పుడు ఆ కర్తవ్యం - నూతన ప్రజాస్వామి కుల మీద పడింది.

అందుకనే మనం ఒక భావాన్ని మార్చాలనుకున్నపుడు అసలు మన లక్ష్యా నికి అనుగుణంగా అది మారే గుణాన్ని కలిగివుందా లేదా అనేది చూసుకోడం చాలా అవసరం. లేకుంటే 'పెద్దకొడుకు'లాంటి కథలూ, పాటల్లో 'పసుపు, కుంకుమలూ' లాంటివి తప్పవు.

భారతదేశాన్ని తల్లితో పోల్చడం, 'తల్లి' అనే భావాన్ని చాలా సెంటిమెంటల్‌గా ట్రీట్ చేయడం గురించి కూడా రచయిత మరోసారి లోతుగా ఆలోచించాలని కోరుతున్నాను. అంకితంలో కేవలం మాతృమూర్తులను మాత్రమే పేర్కొన్నప్పుడు (తండ్రులు కూడా ఉన్నారు కదా రచయిత దృష్టి ప్రకారం పెద్దకొడుకుల్ని అందించడంలో) రచయిత ఏం ఆలోచించి వుండాలి?

ఈ కథలోనే "మేమెట్లయిన హీరోలమే తాతయ్యా! ప్రభుత్వం మిమ్మల్ని సమరయోధులన్నట్లే, మాకూ మరో బిరుదిచ్చింది - నక్సలైట్లమని" అంటాడు రవి ఒకచోట. తాత "లేవరా హీరో" అని అన్నంత మాత్రాన 8 సం॥లుగా ప్రజలలో పనిచేస్తున్న విప్లవకారుడు ఇలా సమాధానం ఇవ్వడం - కొంచెం ఆశ్చర్యమే.

— షహీదా

× × ×

డి.యల్. సుహాసిని వ్యాసంలో చివరలో "విప్లవోద్యమానికి సమాంతరంగా స్త్రీ వాదోద్యమం నడుస్తోందని" నేను అన్న వాక్యంగా కొటేషన్లలో ఉదాహరించడం చదివాను. నేనా వాక్యాన్ని రాయలేదే! నా ఇంటర్వ్యూలో? — అనని మాటలని అన్నట్టుగా రాసెయ్యటం మంచి పద్ధతికాదు. ఏ విమర్శకైనా స్త్రీల ఉద్యమాన్ని రాజకీయం (political) గానే నేను నొక్కి చెప్పినా పట్టించుకోని వాళ్ళ రాజకీయాలు ఎలాంటివో మరి?

హైద్రాబాద్, 15-9-93. - జయప్రభ

[ఈ ఉత్తరాన్ని సుహాసినికి పంపాము. ఆమె యిలా సమాధానం రాసింది. సం॥]

అరుణతార ఎడిటర్‌కు,

మీ ఉత్తరం అందింది. అది చూశాక నా వ్యాసం రాతప్రతిని బైటకు తీసి సరిచూసుకున్నాక జరిగిన పొరపాటు ఎక్కడో అర్థమైంది. ఆ వాక్యం అలా కొటేషన్‌లో ఉండాల్సిందికాదు. దానికి ముందు వాక్యంగా కొటేషన్‌లో ఉండాల్సిన వాక్యాన్ని కింద రాస్తున్నాను. "స్త్రీల సమస్యలకి సంబంధించి స్త్రీలే సమాంతర పోరాటాలు నడుపుకోవాలి" అంటూ విప్లవోద్యమానికి సమాంతరంగా స్త్రీవాదోద్యమం నడుస్తుందని జయప్రభ ఇంటర్వ్యూలో స్పష్టంగానే ప్రకటించారు.

ఈ 'అరుణతార' వ్యాసం మొత్తంలో నేను జయప్రభతో ఎక్కడా విభేదించలేదు. అయితే ఇటీవలికాలంలో స్త్రీవాదం మీద సరి అయిన మార్క్సిస్ట్ విమర్శ

జరగలేదన్నదే నా అభిప్రాయం. "అతి దృష్టి అనావృష్టిగా సాగుతున్న స్త్రీ వాద చర్చ" అన్న నా వ్యాసం ఉదయం పత్రికకు పంపడం జరిగింది. అది ప్రచురింపబడ్డాక అవసరమైతే నేను చర్చకు సిద్ధమే.

జయప్రభ తన ఇంటర్వ్యూలో "సమాజంలో స్త్రీల దోపిడికి సంబంధించి మార్క్సిస్టులకన్నా మా అవగాహన భిన్నమైనది. స్త్రీల సమస్యలపట్ల మార్క్స్ దృక్కోణం అసమగ్రం. సామాజిక, ఆర్థిక రంగాలలోని ఉత్పత్తి, సంబంధాల ఆధారంగా మార్క్స్ తన ఆలోచనలని సిద్ధాంతీకరించాడు. కాని సమాజంలో ముఖ్యంగా, పునరుత్పత్తి జీవులైన స్త్రీలని, వాళ్ళ సమస్యలని మార్క్సిజం పట్టించుకోలేదు.......... అన్ని దశలలో పురుషాధిక్యతకు వ్యతిరేకంగా స్త్రీల సమస్యలకు సంబంధించి స్త్రీలే సమాంతర పోరాటాలని నడుపుకోవాలి" అన్న వాక్యాలలోని మార్క్సిస్ట్ వ్యతిరేక ధోరణిని సరిగా అర్థంచేసుకోగల రాజకీయమే నా వాది.

గూడూరు, 6-10-93. —సుహాసిని



# విరసం వార్తలు

విరసం సభ్యుడు, తూర్పు గోదావరి జిల్లా విరసం యూనిట్ కన్వీనర్ డా॥ కోటా నారాయణరావుపై 1988 జూన్ 2న పెట్టిన అక్రమ కేసు 1993 అక్టోబర్ 4వ తేదీన కోర్టు కొట్టివేసింది.

× × ×

ఇటీవల అక్టోబర్ 9, 10 తేదీలలో హైదరాబాద్‌లో జరిగిన ఏ. ఐ. ఎల్. ఆర్. సి. సభల సందర్భంగా విరసం కార్యవర్గ సభ్యుడు కా॥ వరవరరావు ఏ.ఐ.ఎల్.ఆర్.సి. ప్రధాన కార్యదర్శి అయ్యారు.

× × ×

విరసం మహాసభలు 1994 జనవరి 12, 13 తేదీలలో రాజమండ్రిలో జరుగుతాయి.

× × ×

ఢిల్లీలో డిసెంబర్ 25, 26 తేదీలలో మావో శతజయంతి సందర్భంగా 'మావో థాట్'పై ఏ.ఐ.ఎల్.ఆర్.సి. సెమినార్ జరుగుతుంది. బాలగోపాల్, ఆర్. ఎస్. రావు, సమీరన్ ముఖర్జీ తదితరులు వక్తలు.

× × ×

1980 నుండి ఈనాటి వరకు విరసం సభ్యుల కవితలతో విరసం కవితా సంకలనం 1994 జనవరి విరసం సభల నాటికి తప్పక వస్తుంది.

# అమ్మా ఏడ్వకే !

తల్లీ ధరిత్రీ
నీదంతా చెరచబడిన చరిత్రే !
బహిరంగంగా దాదర్‌ని బలాత్కరిస్తే
నీపేగు ఎంతగా రగిలిపోయిందో !
అమ్మా ! నువ్వు కాలంకాటుకు కుళ్ళిపోతున్న శిలానివి
నువ్వు నువ్వు కాదు, మాంసంముద్దల ఆకారానివి !
రోమ్‌నగర బానిసవి - విపణిలో సరుకువి !
తల్లి ! నీ సహనం ఆకాశం కావద్దమ్మా !
నొప్పులు పడి త్వరగా బిడ్డను కనూ
ఏడ్వకమ్మా !
నీ కనుకొలకుల్నుండి కారే ప్రతి నిప్పు కణికను
అగ్నిగుండంగా మండించు
మింగిన కత్తుల్ని ఒక్కుదుటున తుపాన్లుగా కక్కేయ్ !
అమ్మా ఏడ్వకే !
నీ సహనాన్ని సానపట్టి సమరానికి సాయుధమవ్వు

విశాఖ జైలు, —వజ్రకాంతి

1-4-93



---

# మేం భూసంబంధీకులం

మేం నేల విడిచి సాము చేయలేం
మేం భూమిని తప్ప వేరే పాడలేం
భూమిని పునీతం చేసే ఉత్పత్తికారక జీవితాలని తప్ప- వేరే రాయలేం
మేం భూసంబంధీకులం
భూసంబంధం లేకుండా మా కవిత్వం శూన్యం
మా పాటకి - మా పఠనానికి - మా మాటకి- మా మార్గానికి

భూమే భూమిక

నేల తల్లిని నమ్ముకున్న బక్కరైతు భంగపడితే - ఆ ఆవేదన మా కవిత్వం మండుటెండలో బండలు పగలేసిన మొరటు చేతుల కాయకష్టం - మా కవిత్వం రక్తం ఉడికిపోయి - శరీరం వట్టిపోయి - ముడతల్ని పట్టించుకోని ముసలవ్వ పనితనం పట్టుదల - మా కవిత్వం.

మా కవిత్వం కాస్మటిక్ అందాల్ని అలంకరించుకోదు
సొమ్ములా సోకుల్తో ఆకర్షణీయంగా అగుపించదు
మా కవిత్వం అచ్చం పల్లెటూరి రైతుకూలీలా ఉంటుంది
వాళ్ళు పంటచేలలో పాడుకొనే జానపదంలా ఉంటుంది
ఆకాశ హర్మ్యాల ఊహలకీ - విరుద్ధం మేం
భూపోరాటాల ఆరాటాల అభిమాన కలల తోటల్ని - మా వస్తువుగా
స్వీకరిస్తాం
నిజాన్ని పాతేసి - శ్రమని దోచేసి - హక్కుల్ని కాలరాసే ఉక్కుపాదాల్ని
విరగ్గొట్టేవారి పక్షాన నిలబడతాం
అహరహం శ్రమించే చేతులతో చేతులు కలుపుతాం
గొంతు పొట్లాలు విప్పుకొని బాధల్ని పంచుకుంటాం
విముక్తి మార్గాన్వేషణలో వినూతనంగా వీస్తాం
మేం నేల విడిచి సాము చేయలేం - మేం భూమిని తప్ప వేరే పాడలేం
మేం భూసంబంధీకులం
సంకెళ్ళను ఛేదించే ప్రతిఘటనా పిడికిళ్ళ నినాదం - మా కవిత్వం
తెలంగాణా పల్లెల కల్లోల హృదయం మా కవిత్వం
అడవులు మా కవిత్వం - ఆయుధాలు మా కవిత్వం
ప్రజలు మా కవిత్వం — ప్రజావీరులు మా కవిత్వం
మా కవిత్వం కానిదల్లా - మనల్ని మనవాళ్ళని అసహ్యించే
అల్పబుద్ధుల అనల్ప క్రోధాధముల గురించి మాత్రమే
మా కవిత్వం కానిదల్లా - అసంబద్ధ వ్యవస్థకు వంతపాడే
వింత మనుషుల గురించి మాత్రమే.

—ఆర్. ఆర్. పి.



# NEW PUBLICATIONS OF AILRC

## ON THE OCCASION OF DECENNIAL CELEBRATIONS (OCTOBER 1993)

1. HAMSAB EK SAATH — Rs. 4/-
   A collection of Urdu, Hindi and Telugu Poems against communalism.

2. LAL BANO GULAMI
   CHODO BOLO VANDEMATARAM — Rs. 10/-
   Long Poem by N.K. translated into English by Jc & 'Mo'

3. పోరాట పథంలో ఐక్యమవుదాం — Rs. 5/-
   AILRC పాట్నాలో 93 మేలో నిర్వహించిన "మహిళా విముక్తి - వర్గ పోరాటం" సదస్సులో సమర్పించిన పత్రం.
   క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘటన్, దండకారణ్యం.

4. PRISON HOUSE ROSE GARDEN - Editor : KVR Rs. 15/-
   Seminar Papers on the Nationality Question in India Presented in AILRC Seminar, Bangalore, Oct. 92.

5. AMUKH - AILRC's Literary Journal in Hindi — Rs. 10/-
   Special number on Women Liberation and class struggle.

FREE OFFER
on the occasion of Decennian celebrations.

1. HAIL REVOLUTION — AILRC Publication
   An anthology of Revolutionary Poetry in all Indian Languages.

2. Raging Storm — VIRASAM Publication
   An anthology of Telugu Revolutionary Poetry.

**For Copies :**

Varavara Rao,
203 - Laxmi Apartments,
Malakpet, Hyd - 500 036.

Navodaya Book House,
Opp. Arya Samaj Mandir,
Badi Chowdi, Hyd.

151 ARUNATARA OCTOBER-NOVEMBER, 1993 H/GTR-70

Annual Subscription Rs. 50/- Single Issue Rs. 5/-

అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితి దశాబ్ది సభల దృశ్యాలు



Printed at Nagendra Press, VJA-2 on behalf of Venkataramana Printers, Guntur-1. Revolutionary Writers' Association



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA106M108 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Jayamma |
| స్కాన్ చేసినది | Priyanka |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |